

*Chandamama, June '48*

*Photo by: V. H. Rao*

బ్రహ్మసృష్టి




జుపిటర్

# అభిమన్యు

పూర్ణా రిలీస్

(తమిళం)

ఆంధ్ర, దత్తమండలములకు: పూర్ణాపిక్చర్స్, బెజవాడ, గుంతకల్లు.

## భూమినుండి సంపద

# నేలబొగ్గు



ఏదేశమునైనను పారిశ్రామికముగా చేయుటకు నేలబొగ్గు ఒక ప్రధానమగు ముడిపదార్థము. ఇది లేనిదే ప్రయాణమార్గము లందలి బండ్లు, కర్మాగారములు, గృహములకు ఆటంకము కల్గును. ఈ ప్రక్కనున్న పటము నేలబొగ్గు అధికముగా దొరకు ప్రాంతములను సూచించును. ఇండియా, పాకిస్థానుల లోని మొత్తము నేలబొగ్గు ఉత్పత్తి సంవత్సరమునకు 2,83,40,000 టన్నులు. అమెరికాలో 61,00,00,000 టన్నులు. యునైటెడ్ కింగ్‌డమ్‌లో 20,00,00,000 టన్నులు సంవత్సరమునకు ఉత్పత్తియగుచున్నది.



ఈ నేలబొగ్గును, అత్యధికముగా మనదేశపు రైల్వేలు వాడుచున్నవి. ఇనుము, ఉక్కుపరిశ్రమ, ప్రత్తిమిల్లులు, జనుపనార మిల్లులు, బొగ్గును అంతకన్న తక్కువగా వాడుచున్నవి. గృహోపయోగమునకు వాడబడు నేలబొగ్గు, మొత్తము ఉత్పత్తిలో 1/5 భాగము మాత్రమే.

నేలబొగ్గుగనులలో సుమారు 79,000 మంది స్త్రీలు, పురుషులు పనిచేయుచున్నారు. వ్యవసాయపుకాలములో వీరిలో చాలమంది స్వగ్రామములకు తిరిగి పోవుచుండుటచే ఈ సంఖ్య చాలదు. ఈ బొగ్గునుండి వచ్చు ఉపపదార్థములు మన నిత్యజీవితములో అత్యంత ప్రాముఖ్యమైనవి. వాటిలో ప్రధానమైనవి—బొగ్గు వాయువు పెద్దపట్టణములలో వంటచెరకుగా ఉపయోగించబడును. కాలినబొగ్గు: కొలిమిలకు, పెద్ద పొయ్యిలకు; తారురోడ్లు వేయుటకు; శాకరీన్, ఎసీస్థటిక్స్, రంగులు, మరియు పరిమళ ద్రవ్యములు మొదలగు అనేకపదార్థములు.

మరుసటి నెలయందు ఈ వరుసలో వచ్చు మరియొక ఉత్పత్తి పదార్థముకొరకు వేచియుండుము.
ఈ వరుసను టాంకో స్క్రాప్
పుస్తకములో భోగుచేయుము.

ప్రకటనదారులు:




తయారు చేయు

## ది టాటా ఆయిల్ మిల్స్ కంపెని లిమిటెడ్

చందమామ

ఈ సంచికలో యివి
చదువుకోండి



ఇవన్నీగాక, చిక్కుచదరాలు, ముగ్గులు,
చిక్కుబొమ్మలు, గమ్మత్తుబోలికలు
యింకా, యింకా ఎన్నోవున్నై.


చందమామ ఆఫీసు
పోస్టుబాక్సు నెంబరు. 1686
మద్రాసు. 1.




సంచాలకుడు: చక్రపాణి

సంపుటి 2 | జూలై 1948 | సంచిక 6

## పాపాయిలూ!

క్రిందటిమాటు కుంభకర్ణుణ్ణి గురించి విన్నారు కదూ? ఈమాటు లంకిణిని గురించి చెపుతాను, వినండి.

లంకిణి చాలా బలంకల రాక్షసి. అందుకనే రావణాసురుడు దాన్ని లంకకు కాపలా పెట్టాడు. దానికి తెలియకుండా ఒక్క చీమ లంకలో దూరటానికి వీల్లేదు!

ఆంజనేయుడు సీతమ్మవారిని వెతుకుతూ లంకకు వచ్చాడు. మరి లంకలోకిపోయి ఎవరికీ తెలియకుండా సీతాదేవి జాడ తీయాలి. ఎట్లా? అందుకని హను

మంతుడు చిన్నవాడయి లంకలోకి పోబోయాడు. కాని లంకిణి పోనిస్తుందా? అతన్ని నిలవేసి - "ఎవరు నువ్వు? ఎక్కడికి పోతున్నావు? అని గర్జించింది.

హనుమంతు డేమీ భయపడలేదు. పైగా దానికి ఎదురు ప్రశ్న వేశాడు:- "నువ్వెవరు? నాకెందు కడ్డం వస్తావు?"

"నేను రావణాసురుని బంటును. ఈ లంకకు కాపలా ఉన్నాను. నన్ను జయించకాని ఈ లంకలో ఎవరూ అడుగుపెట్టలేరు. ఇప్పుడు చెప్పు? నువ్వెవరు ?"

"నేను లంక చూసిపోదామని వచ్చాను. ఇక్కడ మేడలూ, మిద్దెలూ, తోటలూ, దొడ్లూ చూసి వెళ్లి పోతాను!" అని హనుమంతుడు లోపలికి పోబోయాడు.

లంకిణి ఊరుకుంటుందా? "ఎక్కడికి పోతావు, నన్ను ఎదిరించి?" అని గుప్పిటితో హనుమంతుడి నెత్తిమీద గుద్దింది. హనుమంతుడు 'అబ్బా' అని అరిచి, తను పెరగటం మొదలుపెట్టాడు. లంకిణికూడా అతన్నిచూసి పెరిగింది. కాని హనుమంతుడు బాగా పెరిగి పెరిగి లంకిణి నెత్తిమీద ఒక గుద్దు గుద్దాడు. ఆ దెబ్బకు లంకిణి 'ఛే' మని అరిచి చచ్చింది.

లంకిణిని చంపిన తర్వాతనే హనుమంతుడు లంకలో ప్రవేశించి సీతమ్మవారిని చూసి, లంకను తగలబెట్టి, శ్రీరాముడికి ఆ వార్తలు చెప్పింది.

# రోకంటి పాటలు

సవతిమీద సవతి నిచ్చేటికన్న
సముద్రమెంత లోతో దిగిచూడరన్న!
మారు బిడ్డలమీద మనువిచ్చేకన్న
మండల మెంత లోతో దిగిచూడరన్న!

పచ్చి పసుపుకొమ్ము పాలవరి దుబ్బు
పట్టింది సీతమ్మ పాండవుల నోము.
తమ్ముడు ఎంతయిన తగు మాటకాడు,
తలుపుచాటుకు పిలిచి తగుమాటలాడి,
తగువాడి పుచ్చుకుంది తమ్ముడి కూతురిని.

సూర్యుడు పెండ్లాయె శుభలగ్నమాయె,
మా యన్న పెండ్లాయె మాకు వేడుకాయె.
అన్నకొడు కెంతయిన ఆత్మీయుడె కాని,
పైన జలకము చల్ల పాత్రుడు కాడు.
బావకొడు కెంతయిన పగవాడె కాని
పైన జలకము చల్లితె పాపములు పోను.

సంపాదన : ఈదర బసవ పూర్ణమ్మ.

# పులి—దోమ

ఏటుకూరి



పులిగాడు రేయంత కొలువు సాగించి
పొదలోన గుఱువెట్టి నిదురపోతుంటె;
దోమ మెల్లగ వచ్చి తొంగి చూచింది,
గూబలో చొరబడి గోల చేసింది.

పులి చెవి జాడించి బోకరిస్తుంటె
దోమ కెక్కడలేని తామసము వచ్చి
"తోక తొండ మ్మున్న దొరగారి నోయి?
ఘీంకరిస్తే గుండె గిసత పారాలె"

పులి

"ఏడ్చా వవతల కేగుము లేదా
ఎముక లేరుతా జాగ్రత్త!"

దోమ

"మిణికావయితే యుద్ధానికిరా
కణతలు కన్నులు పెరికేస్తా"
అంటూ తలపడినవి రెండాపో
రణము సమ్మె సాగింది.

ముక్కు దోమ తొమ్ము విఱిచి
ఱెక్కలార్చుచు,
కన్ను లదర గుట్టి యెట్టు
లున్నదన్నది.



గోళ్లు విప్పి కనులు రక్కు
కొన్నదా పులి,
తల మునుంగ నెత్రుఁగారి
తన్నుకొన్నది.

నిక్కుకొంటు ముక్కుదోమ
నింగి కెగసెను,
పల్టీలు గొట్టుకొంటు
బయలుదేరెను.

దారిపప్పి సాలిగూట
దగులుకొన్నది,
దీని మ్రింగి సాలెపురుగు
త్రేపుచున్నది.

గర్వపడకు డెవ్వరయిన గడచి బ్రతికిరా?
కాలకర్మ మన్నియెడల గలసి వచ్చునా?






మరాటి దండూ కదలిందీ,
మజిలీ లెన్నో చేసిందీ.

అందులో

బడాయి గుఱ్ఱ మొకటుందీ
బంగరు సంచులు మోస్తుందీ.
కంచరి గాడిద యొకటుందీ
మంచము, మట్రా మోస్తుందీ.

పసిండి మోసే గుఱ్ఱాన్నీ
పట్టపగ్గములు లేవండి!
గాడిద వంకకు చూస్తుందీ
గల్లంతుగ సకిలిస్తుందీ.

గాడిద తలవంకించిందీ
కానీ లెమ్మని గొణిగిందీ.

ఎడారి చెంతకు రాగానే
అడవి దొంగ లెగబడ్డారు.
మూటలు, ముల్లెలు దోచారు
ముక్కలు, దొక్కలు చెక్కారు.

పసిండి కోసము గుఱ్ఱాన్నీ
ప్రక్కలు వ్రీలగ బొడిచారు.
త్రాడూ పేడెందుల కంటూ
గాడిద నవలకు ద్రోలారు.

గోడిగ కన్నీర్వెట్టిందీ
గాడిద దాన్నోదార్చిందీ.

బాధ్యత తెలియక పడతారా!
ప్రాణము మీదికె వస్తుందీ.
అన్నీ వైదొల గుంటారా?
హాయిగ జీవిస్తుంటారు.




ఘంటికణతా నొప్పి ఒరగాలితీపు
పంటిపోటూ వద్దు పగవాడికైన.
ఓ చెలికి తగిలింది మోచేతిదెబ్బ
అత్తింటి సౌఖ్యమ్ము అంగలార్చింది.
మారు తల్లీచేత మాటపడలేక
సారంగధరుడమ్మ చావుకొచ్చాడు
అత్తపోసినగంజి సత్తువేలేదు
అల్లుడూ సిరిపురపు గట్టెక్కలేడు!
దంపు దంపనగానె దంపెంత సేపు?
ధాన్యరాసులమీద చెయివేసినట్లు.
వంట వంటనగానె వంటెంత సేపు?
వదినల్లు మరదళ్లు వాదించినట్లు.
చింతచెట్టుక్రింద చిగిలింతగడ్డి
మెయ్యేదుగ మా ఆవు మందల్లకెల్ల
అవుపాలూతెచ్చి పరమాన్నమొండి
కుడుపదుగ మా అమ్మ కూతుళ్లకన్న.
ఉంగరములుపెట్టి ముంగురులుదువ్వి
ఒద్దపెట్టుకు తల్లి ముద్దులాడింది.
పలక బలపములిచ్చి పద్యాలుపాడి
సరసపెట్టుకు తండ్రి చదువు నేర్పాడు.
పిల్లలందరురండి బళ్లోకిపోయి
చల్లన్నిగాలిలో చదువుకొందాము
విసరు విసరూగాలి విసరవేగాలి
మల్లెపూలాగాలి మామీద విసరు.
అరటిపండూతీపి అవుపాల్‌తీపి
మాచిన్ని అబ్బాయి మాటల్లుతీపి.
చదువుకో నాయన్న చదువుకోతండ్రి
చదువుకొంటే నీకు సౌఖ్యమబ్బేను;
ఆడుకో నాయన్న ఆడుకోతండ్రి
ఆడుకుంటే నీకు ఆరోగ్యమబ్బు.
కానివారీతోను కావించుచెలిమి,
కట్టెవిరిచీ పొయిని పెట్టినట్లుండు;
అయినవారీతోను గావించుచెలిమి,
అకుమడిచీ మడత పెట్టినట్లుండు.
కానివారీమాట కంట్లోని నలుసు
అయినవారీమాట అమృతపుతేట.

సంపాదన: దీవి భానుమతీదేవి



**అబ్బాయిలూ, అమ్మాయిలూ!**

పైన తొమ్మిది గుడ్లగూబలు వున్నై చూశారూ. తొమ్మిదీ ఒకే మోస్తరుగా వున్నట్టు కనిపిస్తున్నయ్యికదూ. కాని అలాతేవు. వాటిలో రెండుమాత్రమే ఒక్కరకంగా వున్నై మిగతా ఏడూ ఏడురకాలుగా వున్నై. ఒకేరకంగావున్న అ రెంటు గుడ్లగూబలు ఏవో కనుక్కోండి. మీరు కనుక్కోలేకపోతే జవాబుకోనం 52 వ పేజీలో చూడండి.

# దెయ్యాల్ని జయించిన బ్రాహ్మడు

ఒక బ్రాహ్మణుడు రోజూ రాజుగారి సభకు వచ్చి రాజుగారిని ఆశీర్వదించి కొంతసేపు ఉండి పోతూండేవాడు. ఏమీ అడిగేవాడు కాడు. రాజుగారికి ఇతని చర్య ఆశ్చర్య కరంగా ఉండేది.

ఒకనాడు బ్రాహ్మడు మామూలు ప్రకారం రాజుగారికి నమస్కారంచేసి తిరిగి వెళ్లిపోవడానికి వెనక్కి తిరుగు తున్నాడు. అప్పుడు రాజుగారు "ఏమయ్యా బ్రాహ్మడా! రోజూ ఎందుకిలాచేస్తున్నావు?" అని అడిగారు.

"ఏదో ప్రభువువారిని ఆశ్రయిస్తే...ఏదైనా ...చిన్న భూమి...దయచేయిస్తారని" అన్నాడు బ్రాహ్మడు నట్టుతూ.

"ఏం భూములయ్యా, వల్లకాటి భూములు! అందరూ భూములు దయచేయించమనేవారే! దాచ బెట్టినట్టు" అని విసుక్కున్నారు రాజుగారు.

బ్రాహ్మడు అంతటితో ఊరుకుంటేగా! "చిత్తం...ఆ వల్లకాటిభూమి అయినా దయచేయిస్తే..." అన్నాడు.

బ్రాహ్మడిపట్టుదల చూచేసరికి రాజు గారికి నవ్వువచ్చింది. ఆ సంతోషంలో "సరే, తీసుకోవయ్యా ఆ వల్లకాడు!" అన్నారు.

వెంటనే బ్రాహ్మడు వల్లకాటి భూమి వద్దకు వెళ్లాడు. అక్కడ పెద్దపెద్ద చెట్లూ తుప్పలూ ఉన్నాయి. "సరే ముందు ఈ చెట్లూ తుప్పలూ నరికేస్తే తరవాత ఏదైనా పండించుకోవచ్చు" అని అనుకున్నాడు. ఒక పెద్ద గొడ్డలితెచ్చి అక్కడవున్న ఒక పెద్ద చింతచెట్టు కొట్టడం మొదలెట్టాడు. చెట్టు సగం తెగకముందే దానిమీదవున్న దెయ్యాలన్నీ దిగివచ్చాయి.

"ఏమయ్యా చెట్టు కొడుతున్నావు? నిన్నేమిచేస్తామోచూడు" అని దెయ్యాలు బ్రాహ్మణ్ణి బెదిరించాయి.

బ్రాహ్మడు మాట్లాడలేదు. "ఏమయ్యా మాట్లాడవేం?" అని గద్దించాయి దెయ్యాలు.

ఆ మాటలకి బెదరకుండా "నాయిష్టం. నాకీ భూమిఅంతా రాజుగారిచ్చేశారు." అని మొండిగా సమాధానం చెప్పి బ్రాహ్మడు తిరిగి చెట్టునరకటం మొదలెట్టాడు.

---

రాళ్లపల్లి వెంకట సత్యనారాయణ, విశాఖపట్నం





అప్పటినుంచీ ఏటేటా శ్రమలేకుండా నాలుగు గరిసెల నువ్వులూ కాళ్లముందుకు వస్తూంటే హాయిగా పూలరంగడులాగ కాలక్షేపం చేస్తున్నాడు బ్రాహ్మడు.

* * *

కొన్ని సంవత్సరాలు పోయిన తర్వాత ఆ దెయ్యాల ఇంటికి ముసలిదెయ్యం ఒకటి చుట్టరికానికి వచ్చింది. సరిగా అవి నువ్వులు ఇవ్వవలసిన రోజులు - కాబట్టి దెయ్యాలన్నీ మంచి హడావిడిగా నువ్వులు పోగుజేస్తున్నాయి. ఇదంతా చూచి ముసలి దెయ్యం "ఏమిటీ కథ?" అని దెయ్యాల్ని అడిగింది. అవి సంగతంతా చెప్పాయి.

అప్పుడా ముసలిదెయ్యం "ఏమిటీ! మీకు మతులుపోయినట్టున్నాయి! ఒక బ్రాహ్మడికి జడిసి ప్రతియేటా ఒళ్లు పులిసేటట్టు నువ్వులు పోగుచేసి వాడికి సమర్పించడమా? ఉండండి! ఇప్పుడే వెళ్లి ఆ బ్రాహ్మణ్ణి బెదరగొట్టి ఈ రోజు నుంచీ నువ్వులు ఇచ్చుకో అక్కర్లేకుండా చేస్తాను" అంది.

ముసలిదెయ్యం మాటలువిని దెయ్యాలన్నీ సంతోషించి దాన్ని ప్రయాణంచేసి బ్రాహ్మడింటికి పంపేయి.

మన బ్రాహ్మడికి పనీ పాటూ ఏమీ లేదు గనక ఇంట్లో కూర్చొని హాయిగా పాదులుపెట్టి కూరగాయలు పండిస్తున్నాడు.

ఇంకా ఊరుకుంటే తమకి వుండటానికి చోటేలేకుండా పోతుందేమోనని దెయ్యాలు భయపడి బ్రాహ్మణ్ణి ఇలా అడిగాయి: "ఏమయ్యా, చెటుకొట్టేసి ఏంచేస్తావు?"

"నాయిష్టం. నేను ఇందులో నువ్వుచేను వేసుకొని సాలుకు నాలుగు గరిసెలు నువ్వులు పండించుకుంటాను" అన్నాడు.

"పోనీలేవయ్యా, చెట్టుకొట్టెయ్యకు. ఆ నాలుగు గరిసెల నువ్వులూ ఏటేటా మేమిచ్చుకుంటాంలే" అన్నాయి దెయ్యాలు. "సరే" అని బ్రాహ్మడు ఇంటికి పోయాడు.











అక్కడికి రోజూ ఒక గేదెవచ్చి ముందు వాకిట్లోపెట్టిన బచ్చలిపాదు తినేస్తుండేది.

ఆనాడు బ్రాహ్మడు గేదెపనిపడదామని తలుపుచాటున పెద్ద కఱ్ఱపట్టుకొని నిల్చున్నాడు. అతనికి ఏదో గుమ్మం దాటుతూన్న అలికిడి వినిపించింది—వెంటనే బలంగా కఱ్ఱతో ఒక్క పెట్టు పెట్టేడు..."అమ్మో!" అంది ముసలిదెయ్యం. పాపం బ్రాహ్మడ్ని బెదరించడానికివచ్చి దెబ్బతింది.

"గేదెఅనుకొని దెయ్యాన్ని కొట్టేశానే!" అని బ్రాహ్మడు మనస్సులో విచారించాడు. కాని పైకి ఏమీ కనబరచకుండా, గంభీరంగా "ఏం? ఎందుకొచ్చావ్?" అని గట్టిగా అడిగాడు.

ఇంకా చేతులోనేఉంది కఱ్ఱ. మళ్లా కొడతాడేమో? అనే భయంతో ముసలి దెయ్యం "ను...వ్వు...లు" అంది.

"ఏవీ? తెచ్చావా?" అని దబాయించి అడిగాడు బ్రాహ్మడు.

అప్పుడు దెయ్యం, "కాదు; నువ్వులు ఇమ్మన్నారా? లేక...నువ్వుల పప్పు ఇమ్మన్నారా...అని...అడగడానికి వచ్చేను" అంది జడుస్తూ.

"సరే, నువ్వుల పప్పే తెమ్మను" అన్నాడు బ్రాహ్మడు.

బ్రతుకు జీవుడా అని ముసలిదెయ్యం బ్రాహ్మడి దగ్గరనుండి ఇంటి వేపు మరలింది. కాని దాని మనస్సులో బాధగానేఉంది.

ఇంటికి రాగానే దెయ్యాలన్నీ సంతోషంతో దానిచుట్టూచేరి "ఏంజరిగింది? బెదిరించావా? ఏమన్నాడు?" అని ఊపిరి సలపకుండా ప్రశ్నలువేశాయి.

ముసలి దెయ్యం నీళ్లునములుతూ "నన్ను చితకగొట్టాడు...నువ్వులు అఖ్ఖర్లేదు ఆ నాలుగు గరిసెలూ నువ్వులపప్పే తెమ్మని మీతో చెప్పమన్నాడు" అంది.

దాంతో అవన్నీచేరి ముసలి దెయ్యాన్ని "నువ్వువెళ్లి మాకు చేసుకొచ్చిన ఉపకారం ఇదా?" అంటూ కోపంతో పీకి చంపేశాయి.



# మూడు కొబ్బరికాయలు

ఒక వూళ్లో ఒక విద్వాంసుడు ఉండేవాడు. చక్కదనంలో, పాండిత్యంలో అతనికి మించినవాడు ఇంకొకడు లేడని అందరి వద్దా మంచిపేరు సంపాయించుకొన్నాడు. ఇలాంటి గొప్ప విద్వాంసులకి పాపం, ఎప్పుడూ దరిద్రం తాండవిస్తూ వుంటుంది! కొద్దో గొప్పో సంపాయించిన డబ్బు ఆ రోజు బత్యానికే సరిపొయ్యేది. ఇంక మిగిలే దేముంది?

పైగా అతనికి నల్లటి భార్య దొరికింది. అతను దీనికి చాలా విచారిస్తూ వుండేవాడు. "అయ్యో దేముడా! నేను ఇంత విద్య సంపాయించాను. అందరి వద్దా మంచిపేరు తెచ్చుకున్నాను. కాని ఏం ప్రయోజనం—కాకి ముక్కుకి దొండ పండులాగ నల్ల పెళ్లానికి నేను భర్తకావాల్సి వచ్చింది. నాభార్య ఎర్రగా వుంటే ఎంత బాగుండేది" అని విచారించేవాడు.

ఒకరోజు విద్వాంసుడింటికి ఒక సన్యాసి అతిథిగా వచ్చాడు. భార్యాభర్త లిద్దరూ సన్యాసికి కాళ్లుగడిగి షడ్రసోపేతంగా భోజనం పెట్టారు. సన్యాసి భోజనంచేసి, బయట అరుగు మీద కూర్చున్నాడు. అప్పుడు విద్వాంసుడు బయటికి వచ్చి సన్యాసికి వినయంగా నమస్కరించాడు. అతని భక్తికి సంతసించి సన్యాసి తన వద్దవున్న మూడు కొబ్బరికాయల్ని విద్వాంసుడి చేతికిచ్చి "నీవు ఏదైనా ఒక కోరిక తల్చుకుని ఒక కొబ్బరికాయను పగులగొట్టావంటే నువ్వు తల్చుకున్న కోరిక సిద్ధిస్తుంది. అలాంటి మూడు కోరికలను ఈ మూడు కొబ్బరికాయలు తీరుస్తయ్. వీటిని జాగ్రత్తగా వుంచుకో" అని చెప్పి సన్యాసి తన దారిని వెళ్లిపోయాడు.

విద్వాంసుడు కాయల్ని పుచ్చుకొని లోపలికెళ్లాడు. భార్యను పిల్చి "ఏమేవ్!

జయలక్ష్మి, మద్రాసు

ఈ కొబ్బరికాయల సంగతి నీకు తెలుసా? మనం ఏవైనా కోరుకుని ఈ కాయల్ని కొట్టామంటే మనం కోరుకున్న కోరిక నెరవేరుతుంది. నువ్వు నల్లగా వున్నావు. గనక ముందు నీకు ఎర్రటి శరీరం వచ్చేట్టు తల్చుకుని ఒక కొబ్బరికాయను కొడతాను—నీకు యిష్టమేకదా!" అని అడిగాడు.

భార్య ఆ మాటకు ఒప్పుకోలేదు. "ముందు మన సంసారం గట్టెక్కే మార్గం చూడండి! అదీగాక మూడు కొబ్బరికాయలు వున్నైకదా! మొదటికాయ, మనం ధనవంతులం కావాలనీ, రెండో కాయ నేను ఎర్రగా మారాలనీ, మూడో కాయ ఇంకేమైనా కావాలనీ కొడితే బాగుంటుంది." అని బదులు చెప్పింది.

భార్య మాటలు విద్వాంసుడి కేమీ నచ్చలేదు. "నీకేం మతి పోతోందా! ముందు నువ్వు ఎర్రగా అందగత్తెవైతే తర్వాత మనం కోరుకునేవాటికి రెండు కొబ్బరికాయలున్నైకదా! అంచేత నువ్వు యిప్పుడు ఎర్రగా మారాలి" అని విద్వాంసుడు తన మనస్సులో తల్చుకొని ఒక కొబ్బరికాయను ఠపీ మని కొట్టాడు.



ఎంత ఆశ్చర్యం! వెంటనే విద్వాంసుడి భార్య శరీరం నిమ్మపండులాంటి రంగుకు మారింది. విద్వాంసుడికి పట్టరాని సంతోషం కలిగింది. ఒక్కసారి భార్యవంక ఎగాదిగా చూశాడు. నిజంగా ఆమె శరీరం మెరిసిపోతోంది. ఈ సంగతి వూళ్లోవాళ్లకి తెలిసింది. వాళ్లందరూ విద్వాంసుడి భార్యనుచూసి ఆశ్చర్యపోయారు. "ఇదేమిటి వింత! నిన్నటిదాకా నల్లగానే వున్నది, ఈ రోజు ఎలా ఎర్రగా మారిపోయిందో!" అని ముక్కుమీద వేళ్లేసుకుని అమ్మలక్కలంతా ఎంతోవింతగా చెప్పుకో సాగారు.



విద్వాంసుడు మాత్రం "ఆహా! నా భార్య ఎంత అందంగా ఉంది. రాణికూడా ఇంత అందంగా వుండదు. నే నెంతో భాగ్యశాలిని; సన్యాసి పుణ్యం కట్టుకున్నాడు" అని అనుకుంటూ రోజూ మురిసిపోతుండేవాడు.

ఒక రోజు విద్వాంసుడు ఏదో ముఖ్యమైన పనిమీద ప్రక్క ఊరికి వెళ్లాల్సి వచ్చింది. తన భార్యను పిల్చి "ఏమేవ్! నేను పొరుగూరు వెళ్లుతున్నాను. రెండు మూడు రోజుల్లో తిరిగి వస్తాను, జాగర్తగా ఇంట్లో వుండు!" అని చెప్పి వెళ్లిపోయాడు.

ఆ మరుసటిదినం ఆ వూరి రాజకుమారుడు విద్వాంసుడు వుంటున్న వీధివైపు గుర్రంమీద స్వారిచేస్తూ వచ్చాడు. అదే సమయంలో విద్వాంసుడి భార్య వీధి గుమ్మంలో నిల్చుని ఏదో ఆలోచిస్తూ వుంది. ఆ రాజకుమారు డంటేనే ఆ వూరి ఆడవారికి అమిత భయంగా వుండేది. అంచేత ఆ వీధిలోని వా రెవ్వరూ బయటికి రాలేదు. కాని విద్వాంసుడి భార్య రాజకుమారుడు వస్తూండటం చూడలేదు. రాజకుమారుడు సరిగ్గా ఆమె దగ్గరికివచ్చి నిలబడ్డాడు. ఆమె అందాన్నిచూసి ముగ్ధుడయ్యాడు. రాజకుమారుణ్ణి చూసి విద్వాంసుడి భార్య భయంతో వణికిపోయింది. రాజకుమారుడు ఆమె చేతిని గట్టిగా పట్టుకుని "ఇదుగో! నా అంతఃపురానికి రా! నిన్ను పెళ్లిచేసుకుంటాను" అని బలవంతం చేశాడు.

ఆమె రాజకుమారుడికి ఏమీ బదులు చెప్పలేదు. ఎట్లానో చేతిపట్టు తప్పించుకుని లోపలికి వెళ్లింది. కాని రాజకుమారుడు ఆమెను బలవంతంగా లాగి గుర్రంమీద ఎక్కించుకుని అంతఃపురానికి తీసుకుపోయాడు. ఒక చక్కని మేడలో ఆమెను ఒంటరిగా వుంచాడు. రాజభటుల్ని పిలిచి "ఎవ్వరూ ఈ మేడవైపు రాకూడదు సుమా!

ఎవ్వరైనా వచ్చారంటే వాళ్ళ తల తీయి స్తాను జాగ్రత్త" అని ఆజ్ఞాపించాడు.

విద్వాంసుడి భార్య రెండు రోజులవరకు అన్నం నీళ్లూమానీ మేడలో ఏడుస్తున్నది.

"అయ్యో! ఆ పాడు సన్యాసి మా కెందుకు కొబ్బరికాయలు ఇవ్వాలి? నే నెందుకు అందగత్తె కావాలి? ఈ కర్మ నా కెందుకు పట్టాలి?" అని సన్యాసిని తిట్టిపోసుకుంది.

ఇలా వుండగా పొరుగూరు వెళ్లిన విద్వాంసుడు ఇంటికి తిరిగి వచ్చాడు. వచ్చీ రావడంతోనే తన భార్యను రాజ కుమారుడు చెరపట్టి తీసుకు వెళ్లాడన్న సంగతిని విన్నాడు. "ఓరి, దుర్మార్గుడా! ఇంతవరకూ వచ్చిందా నీ సంగతి. ఇప్పుడే నీపని పట్టిస్తాను చూడు!" అని కండ్లెర్ర జేసి లోపలికి వెళ్లి ఒక కొబ్బరికాయతెచ్చి "నా పెళ్లాం ఎలుగ్గొడ్డుగా మారాలి" అని చెప్పి కొట్టాడు. వెంటనే రాజుగారిమేడలో వున్న విద్వాంసుడి భార్య ఎలుగ్గొడ్డుగా మారిపోయింది. అసలే ఆకలితో మాడిపో తుండటంచేత ఎలుగ్గొడ్డుకి కోపం ఎక్కు వయింది. మేడలోని బీరువాలు, గాజు దీపాలు, సీసాలు అన్నిటినీ ఒక్కసారిగా



ముక్కలు ముక్కలు చేసింది. 'గుర్, గుర్' మని గర్జించడం మొదలుపెట్టింది.

ఇక ఆ రాత్రి విద్వాంసుడి భార్యను చూడటానికి రాజకుమారుడు బాగా అలంక రించుకుని పెళ్లికొడుకులాగా తయా రయ్యాడు. ఎవ్వరికీ తెలియకుండా మేడ తలుపులు తీసి లోపలికి వెళ్లాడు. మేడ లోని ఎలుగ్గొడ్డు రాజకుమారుణ్ణి చూడగానే అమాంతంగా మీదపడి గోళ్లతో రాజకుమా రుడి దేహమంతా చీల్చింది. అతను 'కుయ్యో మొర్రో' మని మొత్తుకున్నాడు. కాని, రాజభటులు కూడా మేడలోకి

రాకూడదని రాజకుమారుడు యింతకు ముందు అజ్ఞాపించినందువల్ల వాళ్లు కూడా రాలేదు. ఎలుగ్గొడ్డు మాత్రం రాజకుమారుణ్ణి చీల్చి రక్తం బాగా జుర్రుకుని గుర్‌గుర్‌మంటూ గదిలో తిరుగుతున్నది.

మామూలు ప్రకారం మేడను కాపలా కాయడానికి రాజభటులు వచ్చారు. వారికి 'గుర్‌గుర్' మనే ఎలుగ్గొడ్డు శబ్దం వినిపించింది. వెంటనే వారు గది దగ్గరికి వెళ్లి చూశారు. "ఇదేమిటీ వింత! లోపల ఎలుగ్గొడ్డు వుందే!" అని వెర్రికేకలు పెట్టి లోపలికి వెళ్ళారు. అక్కడ రాజకుమారుడు కూడా చచ్చిపడి వుండటంచూసి భయపడ్డారు. ఎలుగ్గొడ్డు రాజభటుల మీదికి ఉరికింది. కాని రాజభటులు తప్పించుకుని ఒక్క పరుగుతో అంతఃపురానికి చేరుకున్నారు. ఎలుగ్గొడ్డు మాత్రం వీధులవెంబడి కేకలు పెడుతూ పరుగెత్త సాగింది. దారినవెళ్లే పిల్లల్ని, పెద్దవాళ్లని కూడా గోళ్లతో చీలుస్తూ పెద్ద గందరగోళం చేస్తూ విద్వాంసుడి యింటిదగ్గరికి వచ్చింది. ఎలుగ్గొడ్డుని చూసి విద్వాంసుడికి విచారం వేసింది. "అయ్యో నా భార్యకు ఎంత అవస్తపట్టింది! అందంగా వుండటంవల్లనే కదా దీని కీ గతి? నల్లగా వుంటే ఎంత హాయిగా వుండేది! నాకుకూడా సుఖంగా వుండేది కదా!" అని అనుకుని మూడో కొబ్బరికాయను బయటికి తెచ్చి "నా భార్య పూర్వంలాగే మారిపోవాలి!" అని చెప్పి పగులగొట్టాడు—వెంటనే ఎలుగ్గొడ్డు, మామూలు మనిషి అయింది.

భార్యనుచూసి విద్వాంసుడు ఎంతో సంతోషించి దగ్గరికి లాక్కుని "అయ్యో పాపం! నువ్వు ఎంత కష్టపడ్డావే? ఈ పాడు కొబ్బరికాయలవల్లనే కదా నీ కీ గతి సంభవించింది. మనం వున్నదాంతో తృప్తి పడాలి. లేకపోతే ఇలాంటి కష్టాలే కలుగుతై" అని చెప్పి భార్యను ఓదార్చి అనాటినించీ ఆమెతో సుఖంగా కాలం వెళ్లబుచ్చసాగాడు.





# వీరలక్ష్మి పెద్దక్కయ్య



[గతసంచిక తరువాయి]

చలికాలం వెళ్లి ఎండాకాలం ప్రవేశించింది. ఈలోగా దొంగవెంకయ్య మళ్లీ ఆలోచనలు ప్రారంభించాడు, ఏవిధంగా వీరలక్ష్మిమీద కసితీర్చుకుందామా? అని. తన తోడిదొంగలతోపాటు ఎన్నో పన్నాగాలు పన్నాడు. కాని, వాళ్లకి వీరలక్ష్మి అంటే హడలు ఇంకా పోలేదు గనక, "ఇప్పటికి బాగా బుద్ధిచెప్పింది. మే మా రాకసి జోలికి మళ్లీరాము బాబూ" అన్నారు. కాని వెంకయ్యమాత్రం తన మొండిపట్టు విడవలేదు. ఎట్లాగయినా వీరలక్ష్మి అంతు కనుక్కోవాలని నిశ్చయించుకొన్నాడు. ఎన్నో విధాల తన స్నేహితులకి ప్రోత్సాహమిచ్చాడు. "ఈమాటు తప్పకుండా మన మాయలో పడుతుంది. ఈపాటికి అది, మనం మళ్లీ రాకపోయేటప్పటికి, మనం యిక రాముగదా అని నిర్భయంగా తిరుగుతో వుంటుంది. మనం పొంచివుండి, దాన్ని వొంటరిగా పట్టుకుని మన కసితీర దానికి తగిన శాస్తి చేద్దాం." అని అన్నాడు. వాళ్లు సరేనని గంతు లేశారు.

ఒక మంచిరోజు చూసుకుని దొంగలందరూ రాత్రివేళ వీరలక్ష్మి యింటికి బయల్దేరారు. ఇంటి వెనక దొడ్డి గోడఎక్కి తొంగిచూశారు. ఆరు బయట చల్లగాలికి మంచంమీద పడుకుని గాఢంగా నిద్రపోతున్నది వీరలక్ష్మి.

"చిక్కిందిరా మనచేతుల్లో ఈసారి" అని దొంగలు సంతోషంతో చంక లెగరేసి, గోడ దూకి వీరలక్ష్మి మంచాన్ని గోడదాటించి మోసుకుపోతున్నారు. సగం దోవలో వీరలక్ష్మికి మెలుకువవచ్చి, "ఏమిటా ఇట్లా కదులుతున్నాను" అనుకుని లేచి కూచుంది. ఆమెకి మంచం అడుగునించి ఈమాటలు వినపడ్డాయి. "ఒరేయ్ దీన్ని ఈసారి ప్రాణాలతో వొదిలామా, మన ప్రాణాల్ని మింగుతుందిరా! అందుకని, ఈ మంచంతో సహా దీన్ని వూరిబయట పాడు



పడ్డ భావిలో పడేద్దాంరా" అని. ఇది విని, వీరలక్ష్మి హడలిపోయింది. "అమ్మో! ఈ కిరాతకుల చేతుల్లో మళ్లీ చిక్కాను, ఇంక తప్పించుకోవడం ఎలాగో?" అని అలోచించసాగింది. కొంతసేపటికి ఓ చక్కటి ఉపాయం తట్టింది. మెల్లిగా మంచం నవారు సందుల్లోంచి చెయ్యిదూర్చి, ఒక్కొక్కడి పిలకే బయిటికిలాగి, ఒకడి పిలక ఇంకొకడి పిలకకి ముడేసి మంచం నవారుకి కట్టింది.

ఈ మంచాన్ని మోసుకుంటో, దొంగలు, ఒక అడవిలోంచి వెడుతున్నారు. పోగా, పోగా, ఒక పెద్ద చింతచెట్టు వొచ్చింది. ఇదే సమయమని వీరలక్ష్మి ఆ చింతచెట్టు కొమ్మలు పట్టుకుని చెట్టు ఎక్కిపోయి, అకుల చాటున దాక్కుంది.

పాపం దొంగలు, అవుత్త మంచాన్ని భావి దగ్గరకు మోసుకునిపోయి, "చావు ముండా, మమ్మల్ని ఎన్ని తిప్పలు పెట్టావు? ఇంక పీడ వొదిలిపోయింది" అని ఆ మంచాన్ని విసురుగా ఆ భావిలో పడేసారు. ఆ మంచంతోపాటూ ఆ ఆరుగురు దొంగలుకూడ భావిలోపడ్డారు. "అసాధ్యపు ముండ, ఈమాటూ మనని ఏమార్చి, తప్పించుకుందిరా, బుద్ధి తక్కువయి దీని జోలి కొచ్చాం. దీన్ని ఏ మొనగాడూ జయించలేడు. యింకా నయం, మన అదృష్ట వశాత్తు కాళ్లూ చేతులు, విరగలేదు." అని ఒకళ్ల కొకళ్లు బుద్ధి చెప్పుకుంటూ, ఒకడి మొలనున్న కత్తి తీసుకుని పిలకలన్ని కోసుకుని, అట్లా ఆ



భావిలోనే కూచున్నారు, ఏ దారిపోయేవా డన్నా వాళ్లని బయటికి తీస్తాడేమోనని.

చివరికి, ఆ అడవిలోంచి ప్రయాణం చేస్తున్న కొందరు వర్తకులు, దాహమేసి, ఆ పాడుభావి దగ్గరకు వెళ్లి నీళ్లు వున్నాయో లేవోనని తొంగిచూసారు.

ఈ అరుగురు దొంగలూ వాళ్లని చూసి, "అయ్యా, మమ్మల్ని బయిటికి తియ్యండి, మీకు ఎంతో పుణ్యం వుంటుంది." అని బతిమాలుకున్నారు.

ఆ వర్తకులు జాలిపడి వాళ్లని బయిటికి తీశారు. "ఈ భావిలో ఎట్లా పడ్డారు మీరు" అని వర్తకులు అడిగారు దొంగలని. వాళ్లు జరిగిందంతా చెప్పకండా "వీరలక్ష్మి అనే వంచకురాలు, మమ్మల్ని మోసం చేసి, ముక్కులుకోసి, మా ఆవుల్ని దొంగిలించి చివరికి ఈ పాడుభావిలో పడేసిపోయింది" అని చెప్పుకున్నారు. ఆ వర్తకులలో వీరలక్ష్మి నిజమయిన భర్త వెంకయ్యా ఒకడు. దేశ దేశాలు వర్తకంచేస్తూ తిరిగి, పెళ్లాన్ని తనతో తీసుకువెడదామని ఈ వూరుమీదుగా వస్తూవున్నాడు. వీరలక్ష్మిని గురించి ఈవిధంగా వినేటప్పటికి చాల కోపం వచ్చింది అతనికి. వెంటనే అత్తవారింటికి బయల్దేరాడు పోట్లాడడానికి.

ఈలోపల వీరలక్ష్మి, తెల్లవారగానే, తను అంతసేపూ కోసిన చింతచిగురు వొళ్లో కట్టుకుని, ఇంటికి బయలుదేరి వచ్చి, తన అక్కలచేత చింతచిగురు పప్పు చేయించింది. అక్కా చెల్లెళ్లంతా భోజనాలు చేసి తీరిగ్గా కబుర్లు చెప్పుకుంటూ కూచున్నారు.



ఇంతలో వీరలక్ష్మి భర్త వెంకయ్యా అక్కడికి వచ్చాడు. ముందర వెంకయ్యా గారిని ఎవరూ గుర్తుపట్టలేదు. దాంతో వెంకయ్యగారికి, మరీ కోపం వొచ్చింది.

"నన్ను అప్పుడే మరవనుగూడా మరిచారన్నమాట! నేను లేకపోవడం చూసి మీ చెల్లెలు బాగా చెలరేగింది. నా పరువంతా తీసేసింది." అని అలిచాడు.

వీరలక్ష్మి అక్కలూ, బావలూ, వెంకయ్యా గారి మాటల్నిబట్టీ, అయన రూపాన్నిబట్టీ, అతనే అసలు వెంకయ్య అనీ, వీరలక్ష్మిని తీసికెళ్ళింది, ఎవడో మోసగాడనీ తెలుసుకుని, అతన్ని మంచిగా బతిమాలుకుని, అంత కోపానికి కారణమేమని అడిగారు.

"ఏమి కారణమా! పాపం, ఆరుగురు అమాయకుల్ని మీ చెల్లెలు మోసంచేసి, ముప్పుతిప్పలూ పెట్టి, అఖరికి వాళ్లని పాడు భావిలో పడేసిందట. ఈ సంగతి వూరంతా తెలిస్తే నా కింక మర్యాద వుంటుందా?" అని అరిచాడు వెంకయ్యా.

తమ కేమీ తెలీదనిన్నీ, వీరలక్ష్మే నే కనుక్కోమని వాళ్లు చెప్పారు. వెంకయ్యా వీరలక్ష్మిని పిలిచి అడిగాడు. "మీ కెవరు చెప్పారు?" అని అడిగింది వీరలక్ష్మి.

"ఎవరు చెప్పేదేమిటి? వాళ్లని స్వయంగా, మేము వర్తకులందరం కలిసి భావిలోంచి బయటికి తీశాం. ఎవరు పడేశారంటే నీ పేరు చెప్పారు. పయిగా నువ్వు చేసిన మోసాలన్నీ చెప్పుకుని మొత్తుకున్నారు. నలుగురులో తలెత్తడానికి సిగ్గు చేటనిపించింది నాకు" అన్నాడు వెంకయ్యా.

"అవును నేనే పడేసినమాట నిజం. కాని అలా ఎందుకు చేశానో మీ రందరూ వినండి" అని, వీరలక్ష్మి దొంగ వెంకయ్య తనని ఎట్లా మోసంచేసి ఎత్తుకుపోయాడో, తను దొంగలందరిని ఎట్లా ఏడిపించిందో అంతా చెప్పింది. అందరూ చాల ఆశ్చర్యపడి, వీరలక్ష్మి ధైర్య సాహసాలకి ఎంతో మెచ్చుకున్నారు. మర్నాడు, అసలు వెంకయ్యగారు వీరలక్ష్మిని తనతో తన వూరికి తీసుకుని వెళ్లిపోయినాడు.

[అయిపోయింది]






అనగా అనగా ఒక ఊళ్లో ఒక చెవిటి అతను ఉన్నాడు. అతను ఈమధ్యనే పెళ్లిచేసుకుని కొత్త అల్లుడయ్యాడు. ఒక రోజున అతనికి మామగారిదగ్గరినించి ఒక జాబువచ్చింది. అందులో ఆయనకు జబ్బుగాఉందనీ అల్లుణ్ణి ఒకమాటు వచ్చి చూసిపొమ్మనీ ఉంది.

చెవిటి అల్లుడికి ఆఉత్తరం చూసుకునేవరకు దుఃఖానికి బదులు సంతోషమే వచ్చింది. అది ఎందుకో తెలుసా? అత్తగారింటికిపోతే భార్యని ఒకమాటు చూచుకురావచ్చునని.

తీరా బయలుదేరబోయే ముందు అల్లుడికి ఒక సందేహంకలిగింది. నాకు చెవుడు దాపరించిందికదా! మామగారు మాట్లాడేది నాకెలా తెలుస్తుంది? ఒక వేళ వినపడక వారు ఒకటి అడిగితే నేనింకొక సమాధానమిస్తే మనసంగతి బయటపడిపోదా? కాబట్టి, ముందుగా నేనే "ఏమండీ మామగారూ! ఇప్పుడు వొంట్లో ఎలాఉంది?" అని అడిగితే, అప్పుడు ఆయన-"ఫర్వాలేదు, కొంచెం నయమే!" అంటాడు. అతర్వాత "అయితే మీకు ఇప్పుడు ధారక మేమిటి?" అని అడిగేస్తాను. వారు "ఏదో గంజినీళ్లు తాగుతున్నా"నని సమాధానమిస్తారు. అప్పుడు ఇక సులభంగా "సరే, అదే తీసుకోండి; కాని ఏవైద్యుడి దగ్గర మందు తీసుకుంటున్నారు?" అని అడిగి వెయ్యవచ్చును. ఆయన ఏదో పేరుచెప్పి వారిదగ్గర పుచ్చుకుంటున్నానని చెప్తాడు. అప్పుడు "సరే, వారిదగ్గరే పుచ్చుకోండి!" అంటాను. అంతటితో నాపని తీరిపోతుంది. చక్కగా పెళ్లాందగ్గరికిపోయి మాట్లాడి ఆవిడను వెంటబెట్టుకుని ఇంటికి వచ్చేస్తాను, అనుకున్నాడు.

ప్రసాద్ — మద్రాసు



అతను వాకిట్లో అడుగు పెట్టాడోలేదో బావమరదులు వచ్చి అతని కాళ్లకు చుట్టు కున్నారు. వాళ్ళచనువు చూసేవరకు అల్లుడు సంతోషం పట్టలేకపోయాడు. తన చేతిలో మిరపకాయలు తలా నాలుగూ పంచిపెట్టి, ఇంకోనాలుగు మామగారికోసం అట్టే పెట్టాడు.

ఇంతలో ఒక్కొక్క పిల్లవాడూ మిరప కాయలు కొరకటమూ ఏడవటమూ మొదలు పెట్టారు. మన చెవిటి అల్లుడు పిల్లలు కాయలు చాలక ఏడుస్తున్నారనుకుని తన చేతిలో ఉన్న ఆ నాలుగు కాయలుకూడా వాళ్ళకే ఇచ్చాడు. పిల్లలు ఏడుపు మాన లేదు. ఇంతలో అతనిఅత్త బయటికివచ్చి సంగతంతాచూసి "భలే సరసమాడావులే బాబూ! ఆ నోరుతెలియని పిల్లలతో! నీ కెవరూ పెద్దవారు దొరకలేదా నీచాతుర్యం చూపించటానికి" అని కోపపడింది.

పాపం అల్లుడి మొహం తెల్లబడి పోయింది. జరిగిన పొరపాటుకు మనసులో తిట్టుకుని, చల్లగా మామగారి దగ్గరికి

చెవిటి అల్లుడు చల్లగా మామగారి ఊరు చేరుకున్నాడు. అఊళ్లోనే ఒకచోట ఒక మనిషి కూరగాయలు అమ్ము తున్నది. అది చూడగానే మామగారి పిల్లలకి ఏదైనా తీసుకుపోవాలని జ్ఞాపకం వచ్చింది. అయితే ఏవి తీసుకుపోవాలి? అక్కడవున్న కూరగాయలలోకెల్లా పండు మిరపకాయలు ఎర్రగా అందంగా ఉన్నాయి. ఇంకేం అవి ఒక అణాకు తీసు కుని మామగారి ఇంటికి చేరుకున్నాడు.





వెళ్ళాడు. అల్లుణ్ణి చూడగానే మామ మొహం వికసించింది. కూర్చోమని చేతితో సైగచేశాడు.

అల్లుడు మామగారి పక్క మీద కూచుని అదివరకు వల్లించుకు వచ్చిన ప్రకారం "ఏమండీ మామగారూ! ఇప్పుడు వొంట్లో ఎలా ఉంది?" అని అడిగాడు.

"ఏమి చెప్పేది నాయనా! నా స్థితి చూస్తే ఇవ్వాళో, రేపో అన్నట్టువుంది. ఇంతకీ మనచేతిలో ఏముందీ?" అన్నాడు భావిలోనించి మాట్లాడినట్లు.

అల్లుడికి ఆ మాటలు ఒక్కటికూడా వినపడలేదు. అయినా ఆ వెనక అనుకుని వచ్చిన మాటలు ఒక్కటొక్కటే అనసాగాడు: "అయితే మీకిప్పుడు ధారకం ఏమిటి?"

మామకు ఈమాట వినేవరకు అసహ్యం వేసింది. "ధారకంకాదు, నాపిండాకూడు తింటున్నాను!" అన్నాడు విసుగుతో.

అల్లుడికి ఈ మాటా వినపడలేదు. అయినా విన్నట్టు సంతోషించి-"ఐతే మరీ మంచిది. కొన్నాళ్లు అదే తీసుకోండి. మీ ఆరోగ్యం బాగుపడుతుంది." అని చిరునవ్వుతో-"మరి మీకిప్పుడు మందు ఎవరూ ఇచ్చేది?" అని అడిగాడు.

ఈమాట వినేవరకు మామకు గొంతువరకు కోపంవచ్చింది. అది అంతా ఆయన దిగమింగుకుని "ఎవరా?యమధర్మరాజు." అని కళ్ళుమూసుకున్నాడు.

"అయితే ఇకేం! నిర్భయంగా వారి దగ్గరే మందు పుచ్చుకోండి. వారిని



నమ్ముకున్నవాళ్ళకి ఏమీ భయంలేదు." అన్నాడు.

మామకు కోపంవచ్చి ఇక ఏమీ మాట్లాడలేదు. ఇక తను వచ్చిన పని అయిపోయింది కదా, భార్యనైనా చూద్దామని అల్లుడు ఇంట్లోకి పోయాడు. అతనికి భార్యబదులు అత్త ఎదురైంది. అల్లుడిని చూడగానే ఆమెకు ఎక్కడలేని కోపమూ వచ్చింది.

"ఏం బాబూ! మళ్ళీ ఏం తెచ్చావు? పిల్లలు నీ మూలాన నోరు మండి చస్తున్నారు?" అని మందలించింది.

ఈమాటు పిల్లలు బావచుట్టూ చేరి చొక్కా లాగీ, పంచె లాగి గోలచేయటం మొదలుపెట్టారు.

మామగారు ఈ గోల అంతా మంచం మీదనించి విని భార్యతో - "మనకి భలే అల్లుడు దొరికాడు! నేను యమధర్మ రాజు దగ్గరికిపోతే బాగుంటుందట వీడికి!" అన్నాడు.

ఈ మాట వినేవరకు అత్తకు ఏడుపు వచ్చింది. "మనకు తెలియక ఆ చిన్న దాని గొంతు కోశామో!" అని ఏడవటం మొదలుపెట్టింది.

పాపం చెవిటి అల్లుడికి ఇదంతా ఏమీ అర్థంకాలేదు. ఇప్పుడే బయటికి వెళ్ళి వస్తానని అత్తతో చెప్పి తిన్నగా ఇంటిదారి పుచ్చుకున్నాడు. పాపం! ఆవాళ అతనికి తిండికూడా లేదు. ఇల్లు చేరుకునేవరకు అతని తాతలు దిగివచ్చారు!






అనం గనంగా ఒక వూరు. ఆ వూళ్లో ఒక బీద జంగందేవర వుండేవాడు. అతను ప్రతిరోజు ప్రొద్దున్నే లేచి, స్నానంచేసి, ఒంటినిండా విభూదిరేఖలు పెట్టుకుని వూళ్లో భిక్షాటనకి పోయి, ఆ వచ్చిందాంతో పొట్ట నింపుకుని జీవిస్తుండేవాడు.

ఆ వూరికి ఒక రాజు వున్నాడు. పాపం ఆ రాజుకి ఎంతకాలానికీ పిల్లలు కలగ లేదు. చివరికి, ఎన్నో పూజలు, పునస్కారాలు చెయ్యగా, చెయ్యగా అతనికి ఒక కొడుకు పుట్టాడు. రాజు సంతోషానికి అంతులేదు. పెద్ద విందు ఏర్పాటుచేసి ఆవూళ్లో అందరినీ పిలిచాడు.

విందు పూర్తిఅయింది. రాజుగారికి ఒక పెద్ద తోటకూడావుంది. అందులో రక రకాల పళ్లచెట్లు, రకరకాల పిట్టలువున్నై. విందుకు వచ్చినవారితో రాజు "నా తోటలో మీకు ఎవరికి ఏది కావలిస్తే అది పట్టుకు పొండి," అన్నాడు. ఇంకేం, ఒకరు ఒక మామిడిచెట్టుని వున్న కాయలన్నీ రాల్చు కున్నారు, మరొకరు ఒక సపోటాచెట్టుని వున్న కాయలన్నీ కోసుకున్నారు. ఇలా అందరూ ఎవరికి కావలసినవి వారు. తీసుకుపోయారు. ఇక మన జంగందేవర ఏంచేశాడో తెలుసా? ఆ తోటలో ఒక కొంగ పిల్ల కనిపించింది. దాన్ని తీసుకుని యింటికి వెళ్లి పెంచుతున్నాడు.

* * *

కొన్నాళ్లు గడిచినై. కొంగపిల్ల పెరిగి పెద్దదైంది. అప్పుడు మన జగందేవర దాని మెడకి ఒక చిన్నరాయి కట్టి ఎగర వేశాడు. అది ఎగిరి, ఎగిరి సాయంకాలానికి యింటికి తిరిగొచ్చింది. మర్నాడు యింకొంచెం పెద్దరాయి కట్టి ఎగరేశాడు. మళ్లీ అలాగా ఎగిరి ఎగిరి తిరిగివచ్చింది. రోజు యిలాగే, ఒక రోజుకంటె యింకో రోజు పెద్దపెద్ద రాళ్లు కట్టి ఎగరవేస్తూ వచ్చాడు. కొంగకూడా ఆ బరువుకు అల వాటుపడి ఆ రాతితోపాటే ఎగురుతూ సాయంకాలానికి యింటికి తిరిగివచ్చేది.

పడవల సీతారామయ్య, ఈడేపల్లి





కూతురు మేడమీద తలార్చుకొంటూవుంది. ఆకాశాన వస్తున్న మన జంగందేవరని చూసింది. ఒంటినిండా విభూదిరేఖలు అవీ చూసి కైలాసంనించి శివుడే దిగి వస్తున్నా డనుకొని నమస్కారంచేసి మేడ మీదికి దిగమని కోరింది. వెంటనే మన జంగందేవర దిగాడు.

"తమ రెవరో తెలుసుకోవచ్చా? చూడ బోతే తమరు పరమశివునిలా వున్నారే!" అని అడిగింది రాజు కూతురు.

'అవును, నేను పరమశివుడినే. భూలో కంలో సంచారం చేద్దామని కైలాసంనించి వస్తూన్నాను." అని బొంకాడు జంగం దేవర.

"అలాగైతే మీరు నన్ను వివాహ మాడాలి. మిమ్మల్ని తప్ప యింకొకర్ని పెళ్లిచేసుకోను" అని పట్టుబట్టింది రాజు కూతురు.

"సరే, అలాగే. మళ్లీ రేపు ఈ వేళకు వస్తాను. ఈలోగా నీ తలిదండ్రులతో చెప్పి సిద్ధంగా ఈ మేడమీదనేవుండు. నేను వచ్చి నిన్ను నాతోకూడా తీసుకుపోతాను" అని చెప్పి జంగందేవర తిరిగి కొంగమీద ఎక్కి యింటికి వెళ్లిపోయాడు.

ఈ సంగతంతా రాజుకూతురు తలి దండ్రులకు చెప్పింది. "పరమశివు

ఆఖరికి ఒక రోజున మన జంగందేవర తనే కొంగమీద కూర్చున్నాడు. వెంటనే కొంగ రోజులాగానే, ఆకాశానికి ఎగిరిపోయి తిరిగి యింటికి తీసుకునివచ్చి దించింది. ఆరోజు మొదలుకొని జంగందేవర కొంగ మీదే షికార్లకి పోతూవుండేవాడు.

ఒక రోజున మన జంగందేవర మామూలుగా స్నానంచేసి, ఒంటినిండా విభూది రేఖలు ధరించి కొంగమీద ఎక్కి షికారుకు బయలుదేరాడు. అలా పోతూ పోతూ వుండగా రాజుగారి మేడ వచ్చింది. సరిగ్గా అదే సమయాన రాజుగారి



డేమిటి, కైలాసంనించి దిగిరావట మేమిటి? ఒక వేళ వచ్చినాకూడా, నేన్ను పెళ్లాడట మేమిటి?'' అని రాజు ఎంతో ఆశ్చర్య పోయాడు.

"కాదు. రేపు ఈవేళకి మనం అందరం మన మేడమీద వుండాలి. అప్పుడు మీ కళ్లతో మీరే చూస్తారు నే చెప్పింది నిజమో అబద్ధమో!'' అంది రాజుకూతురు.

"సరే, అలాగే చూద్దాం'' అని రాజు ఈ సంగతివూళ్లో చాటింపు వేయించాడు.

తెల్లవారేసరికల్లా వూళ్లో జనాభా అంతా ఈ వింత చూద్దామని రాజుగారి మేడ చుట్టూ మూగారు. రాజు, రాణి, తమ కుమార్తెతో మేడమీద పరమశివుని రాక కోసం కాచుకుని వున్నారు.

ఇంతలో మన జంగందేవర, రోజూ కంటె యింకా ఎక్కువగా విభూదిరేఖలు ధరించి, ఒక చేత్తో త్రిశూలం, మరొక చేత్తో కత్తి పట్టుకుని, కొంగమీద మేడ పైగావచ్చాడు. రాజు, రాణి సంతోషం పట్టలేక "స్వామీ, దిగిరండి'' అని ఆహ్వానించారు.

మన జంగందేవరకికూడా ఎక్కడలేని సంతోషం కలిగింది. ఆ సంతోషంలో తన చేతిలోవున్న కత్తిని దర్జాగా అటూ యిటూ త్రిప్పాడు. కొంగకి చేప లంటే



యిష్టంగదూ! ఆ ఎండకు కత్తి తళుక్కుమని ఒక చేపలా కనిపించింది కొంగకి. దాన్ని పట్టుకుందామని కొంగ గబుక్కున మెడ ముందుకు జాపింది. ఇంకేముంది? పదునైన ఆ కత్తి తగలగానే కొంగమెడ కాస్తా తెగిపోయింది. దాంతో, మన టక్కరి జంగందేవర "హరహరా'' అంటూ మేడ మీదికిపడి ప్రాణాలు విడిచాడు.

వచ్చినవాళ్లంతా జంగందేవర చేసిన మోసం గ్రహించి మోసానికి తగినశాస్తి జరిగిం దనుకుంటూ ఎవరిళ్లకు వాళ్లు వెళ్లారు. మనమూ మన ఇంటికి వచ్చాం.



# గూనన్న కథ



పూర్వం ఒక వూళ్లో ఒక పెద్దమ్మ వుండేది. ఆ పెద్దమ్మకి ఏడుగురు కొడుకులు. ఏడుగురిలో పెద్దకొడుకు గూనివాడు. అంచేత ఆరుగురు తమ్ములూ అన్నని 'గూనన్న' అని పిలిచేవాళ్లు. అతన్ని చూస్తే తమ్ములకెవరికీ సరిపడేది కాదు.

కొంతకాలానికి పెద్దమ్మ తన ఏడుగురు కొడుకులకీ పెళ్లిళ్లు చేసింది. పాపం, మన గూనన్న ఖర్మానికి తగ్గట్టు పెళ్లాంకూడా గూనిదే దాపరించింది. ఇది చూసి తమ్ములు యింకా ఎగతాళి చెయ్యటం మొదలెట్టారు. అయినా గూనన్న ఏంచేస్తాడు? వాళ్ళు ఎన్ని అన్నా ఎదురు చెప్పకుండా వూరుకునేవాడు.

మరి కొంతకాలానికి అన్నదమ్ములందరూ భాగాలు పంచుకున్నారు. పెద్దమ్మకి ఏడు గేదెలుకూడా వున్నై. వాటిలోకూడా ఒక గేదె గూనిది. పాపం గూనన్న భాగంలో గూని గేదే వచ్చింది. తనూ, తన పెళ్లాం గూనివాళ్లు అయినప్పుడు యిక గేదె గూనిదైతేమాత్రం తప్పుతుందా అనుకుని గూనన్న దాంతోనే తృప్తిపడి వూరుకున్నాడు. పెద్దమ్మకికూడా గూనన్న అంటే గిట్టేదికాదు. అంచేత భాగాలు పంచుకున్న తర్వాత పెద్దమ్మ మిగిలిన ఆరుగురు కొడుకుల వైపే చేరింది.

గూనన్న తన గూని పెళ్లాంతోటీ గూని గేదెతోటీ వేరే కాపురం వుంటున్నాడు. రోజూ పాలు పితకటం గూనన్న వంతు. గేదె గూనన్న పెళ్లాన్ని దగ్గిరికే రానిచ్చేది కాదు.

ఇలా వుంటుండగా ఒకరోజున గూనన్న ఏదో పనిమీద పొరుగూరు వెళ్లవలసి వచ్చింది. మరి తను వూరికి వెడితే పాలు ఎవరు పితుకుతారు! అందుకని ఆపని తన తమ్ముల్లో ఎవరికైనా వప్పజెబుదా మనుకున్నాడు. అనుకుని పెళ్లాన్ని పిలిచి, "ఏమే, నేను వూరికి వెడుతున్నాను. మళ్లీ రెండు రోజుల్లో తిరిగొస్తాను. ఈ రెండు రోజులు పాలు పితకటానికి నా తమ్ముళ్లనెవరినైనా రమ్మను" అని చెప్పి గూనన్న వూరికి వెళ్లిపోయాడు.

సరే గూనన్న పెళ్లాం తన మరదులలో ఒకరిని పిలిచి పాలు పితికిపెట్టమని అడిగింది. సరే నన్నాడు మరిది. అప్పుడు

గొల్లకోట సూర్యప్రకాశరావు, పెద్దాపురం



గూనన్న పెళ్లాం ఒక్కొక్కటి మూడుశేర్లు పట్టే మూడు తప్పేలాలు మరిదికిచ్చింది, పాలు పితకటానికి. మరిది పాలు పితకటం మొదలెట్టాడు. మూడు తప్పేలాలూ నిండినై. ఇంకా పాలు వున్నై. ఇంతలోనే గూనన్న పెళ్లాంవచ్చి "ఇంక చాలు, మిగిలిన పాలు దూడకి వదిలెయ్యి." అంది. ఇది వినేసరికి మరిది అశ్చర్యపోయాడు! ఎంచేతనంటే తమ గేదెలన్నీకూడ శేరుకు మించి పాలు యివ్వటంలేదు. అలాంటిది, ఒక గూనిగేదె తొమ్మిది శేర్ల పాలు యిచ్చింది. పైగా యింకా యిస్తూవుంటే గూనన్న పెళ్లాం 'దూడ తాగుతుంది, వదిలెయ్య'మంది. అసలే గూనన్న అంటే గిట్టదుకదా! పైగా యిది చూసేసరికి గూనన్న తమ్ముడికి ఎక్కడలేని ఓర్వలేనితనం వచ్చింది. ఎలాగైనా గూనన్న గేదెని చంపివెయ్యాలనుకున్నాడు. ఇలా అనుకోటమే తడవుగా తన మిగత అయిదుగురు అన్నలదగ్గిరికిపోయి "చూశారన్నా, మన గేదెల్లో ఒకటికూడా శేరుకు మించి పాలు యివ్వటంలేదు. అలాంటిది మన గూనన్న గెదె యివ్వాళ తొమ్మిది శేర్లకు పైగా పాలిచ్చింది. ఎలాగైనా దాన్ని చంపెయ్యాలి" అని చెప్పాడు. వాళ్లూ సరేనంటే సరేనన్నారు.

మర్నాడు ప్రొద్దున్న మళ్లీ మరిది వచ్చాడు పాలు పితికిపోవటానికి. పాలు పితికినతర్వాత అతను గూనన్న పెళ్ళాంతో "ఒదినా, ఒదినా! మా గేదెల్ని పొలంతోలుకు వెళ్తున్నాం. నీ గేదెనికూడా తీసికెళ్లమన్నావా?" అని అడిగాడు. పాపము వెర్రిబాగులదానికి తన మరదులు పన్నిన కుట్ర ఏమీ తెలుసు? అంచేత "అలాగే నాయినా! మీరు మేపుకొస్తానంటే నేను కాదంటానా" అని గేదెని పంపింది.



ఈలోగా మిగిలిన నలుగురు తమ్ములు వూరిబయట ఒక అడవి వుంటే అందులో ఒక పెద్ద గొయ్యితవ్వి దానినిండా సీసపు పెంకులు, మేకులు అవీ పాతి సిద్ధంగా వున్నారు. కాసేపటికి గూని గేదెని తీసుకుని అయిదోవాడు వచ్చాడు. అయిదుగురూ చేరి పాపం ఆ గూనిగేదెని గొయ్యిలోకి త్రోసేశారు. గాజు పెంకులు అవీ



గుచ్చుకుని గేదె ఒళ్ళంతా రక్తం వరద లుగా కారిపోతోంది. ఈవిధంగా వాళ్లు తమ అన్నమీది కసి పాపం నోరులేని ఆ గేదె మీద తీర్చుకున్నారు.

ఇక్కడిలా వుండగా పొరుగూరు వెళ్లిన గూనన్న యింటికి తిరిగి వచ్చాడు. జరిగిన సంగతంతా తెలుసుకుని తన గేదెని వెతుక్కుంటూ బయలుదేరాడు. వెతుకుతూ, వెతుకుతూ, చివరికి గేదె వున్న గోతిదగ్గిరికి వచ్చాడు. గూనన్న వస్తున్న అలికిడి విని మిగతా అయిదుగురు తమ్ములూ ఉడాయించారు.

గోతిలో గేదె కనిపించింది. పాపం గూనన్న చాల విచారించాడు. ఇదంతా తన తమ్ములు చేసిన మోసమేనని గ్రహించి ఎలాగైనా వాళ్లకి బుద్ధి చెప్పాలని నిశ్చయించుకున్నాడు.

తర్వాత ఒక మాదిగవాణ్ణి పిలిచి గేదెని బైటికి తీయించాడు. చర్మం మాదిగవాడి కిచ్చి, మాంసం అంతా బస్తాల్లో కెత్తి కుట్టించి ఒక గుఱ్ఱం మీద వేసుకుని బయలుదేరాడు.

అలా పోయి, పోయి ఒక చెట్టునీడన ఆగి అక్కడ విశ్రాంతి తీసుకుంటున్నాడు. ఇంతలో మరో వర్తకుడు గుఱ్ఱంమీద ఏదో బస్తాలు వేసుకుని ఆ దారివెంటే వచ్చాడు. గూనన్నని చూసి దిగాడు. 'మీ దేవూరు' అంటే 'మీ దేవూరు' అనీ 'నీ బస్తాల్లో ఏమున్నై' అంటే 'నీ బస్తాల్లో ఏమున్నై' అనీ ప్రశ్నించుకున్నారు. తర్వాత ఇద్దరూ చెట్టుకింద విశ్రాంతి తీసుకుందామని పడుకున్నారు. గూనన్న మాత్రం నిద్రపోతున్నట్టు నటిస్తూ పడుకున్నాడు. వర్తకుడు కాసేపట్లో నిద్రపోయాడు. వెంటనే గూనన్న తన గుఱ్ఱాన్ని మాంసం బస్తాల్ని అక్కడ వదిలి, వర్తకుడి గుఱ్ఱంమీద అతని రూపాయల బస్తాలతో ఉడాయించాడు. వర్తకుడు లేచి చూసుకుని జరిగిన మోసానికి విచారించాడు.

గూనన్న రూపాయల బస్తాలతో యింటికి చేరాడు. గూనన్న పెళ్ళాన్ని పిలిచి, "ఒసే, మా తమ్ముళ్ల యిళ్లకుపోయి ఎవరి దగ్గిరైనా కుంచం వుంటే పట్టుకురా, రూపాయలు కొలిచి మళ్లీ యిచ్చేద్దాం" అన్నాడు. సరేనని గూనన్న పెళ్లాం ఒక మరిది యింటికి వెళ్లి కుంచం యిమ్మని అడిగింది. గూనన్న ఏమి కొలుస్తాడో తెలుసుకోవాలని మరిది కుంచం అడుగున చింతపండు పెట్టి యిచ్చాడు. గూనన్న రూపాయలుకొలిచి కుంచం తిరిగియిచ్చి వేసాడు. కుంచం అడుగున చింతపండు వుంటంచేత ఒక రూపాయి దానికి





అతుక్కుంది. అది చూసి గూనన్న తమ్ముడు ఆశ్చర్యపోయి మన గూనన్నకి కుంచాలతో కొలవవలసినంతగా రూపాయలు ఎక్కడివో తెలుసుకోవాలనుకుని, వచ్చి గూనన్నని అడిగాడు.

''ఒరే, మీరు కుట్రపన్ని నా గేదెని చంపారు గదా. అయినా నేను మాత్రం తెలివి తక్కువవాడినా. గేదె మాంసం అంతా ముక్కలు ముక్కలుచేసి బస్తాలకెత్తి ముక్క రూపాయి చొప్పున అమ్ముకొచ్చాను'' అని చెప్పాడు.

తమ గేదెల్నికూడా చంపి, వాటి మాంసంకూడా ముక్క రూపాయి చొప్పున అమ్ముకోవచ్చుగదా అనుకుని మిగతా అయిదుగురు తమ్ములుగూడా తమ గేదెల్ని బలవంతాన చంపి వాటి మాంసం అయిదు బస్తాలకెత్తి, వూళ్లో అమ్మటానికి బయలుదేరారు. వూళ్లోవాళ్లు 'బస్తా ఎలా?' అని అడిగారు. ఇలా అడిగేసరికి వాళ్లకి ఎంతో ఆశ్చర్యంవేసింది. 'ఇదేమిటి? మా అన్న ముక్క రూపాయి చొప్పున అమ్ముకొస్తే మీరు బస్తా ఎంతని అడుగుతున్నా రేమిటి?'' అన్నారు. ఆఖరికి ఎలాగైతేనేం బస్తా రూపాయ చొప్పున అయిదు బస్తాలూ అయిదు రూపాయలకి అమ్ముకుని యింటికి వచ్చారు. గూనన్న తమని యిలా మోసం చేసినందుకు ఎలాగైనా కసి తీర్చుకోవాలనుకున్నారు. అయిదుగురూ చేరి ఆరాత్రికి గూనన్న యిల్లు తగలబెట్టాలనుకున్నారు.

ఈ సంగతి గూనన్న చెవిన ఎలాగో పడ్డది. తన యింటో సామానుతోసహా పెళ్లాన్నికూడా తీసుకుని వూరిబైట అడివికి చేరుకున్నాడు. గూనన్న అటు పోగానే అతని అయిదుగురు తమ్ములూ వచ్చి, గూనన్న యింట్లోనే వున్నాడనుకుని వెంటనే యింటికి నిప్పు అంటించి, ''చావరా, గూనన్న! ఇవ్వాల్టితో నీకీ భూమ్మీద రుణం తీరింది. మమ్మల్ని మోసం చేసినందుకిదే శాస్తి'' అని చంక తెగరేసుకుంటూ తమ యిళ్లకు చేరుకున్నారు.

తెల్లవారింది. గూనన్న పెళ్ళాంతోపాటు తిరిగి వచ్చాడు. ఇల్లు కాలి బూడిదై పోయివుంది. మరో యిల్లు అద్దెకు తీసుకున్నాడు. కర్రా గిర్రా కాలగా బొగ్గులు మిగిలినై. గూనన్న ఆ బొగ్గులన్నీ మళ్లీ బస్తాల్లోకి నింపి మళ్లీ అదివరకటి లాగానే వూళ్లోకి గుఱ్ఱంమీద బయలుదేరాడు.

గూనన్న అదృష్టంకొద్దీ ఈసారికూడా యింకో వర్తకుడు గుఱ్ఱంమీద రూపాయల సంచులు వేసుకునివస్తూ కలిశాడు. అది వరకులాగానే ఈ వర్తకుడుకూడా గూనన్న





చేతిలో మోసపోయాడు. గూనన్న తన బొగ్గుల బస్తాలు అక్కడ వదిలి వర్తకుడి రూపాయల బస్తాలతో తిరిగి యింటికి చేరుకున్నాడు. మళ్లీ తమ్ముల నడిగి కుంచం పట్టుకురమ్మని భార్యని పంపాడు.

తమ్ములంతా పరుగెత్తుకుంటూ వచ్చి, "ఈసారి ఎలా సంపాయించావ్, ఇన్ని రూపాయలు? అసలు నువ్వు బతికెలా వున్నావ్! నిన్ను యింట్లో పెట్టి యిల్లు తగలబెట్టాం గదా?" అని అడిగారు.

"ఒరే, నేనేనా వెర్రివాడిని? మీరు యిల్లు తగలబెట్టాలని ప్లాను వేసుకున్న సంగతి నాకు ముందే తెలిసి జాగ్రత్త



పడ్డాను. తర్వాత యిల్లు కాలగా మిగిలిన బొగ్గులు బస్తా పందరూపాయల చొప్పున అమ్మివేశాను." అని చెప్పాడు గూనన్న.

పాపం, యిదంతా నిజమేనని నమ్మారు తమ్ములు. తమ యిళ్ళుకూడా తగలబెట్టుకుని ఆ వచ్చిన బొగ్గులన్నీ బస్తాలకెత్తి వూళ్లో అమ్మటానికి బయలుదేరారు. కాని ఎవరినడిగినా 'బస్తాకి రూపాయికంటే ఎక్కువ యివ్వం' అనేవాళ్లే. "ఈసారి కూడా మనకి టోపీవేసాడు, వీడి తాడు తెగ" అని గూనన్నని తిట్టుకుని ఆ అయిదుగురు తమ బస్తాలు రూపాయి చొప్పునే అమ్ముకుని యిళ్ళకి చేరుకున్నారు. మళ్లీ ఆలోచనలు ప్రారంభించారు, గూనన్నని ఎలాగైనా చంపాలని.

ఆరోజు రాత్రి గూనన్న నిద్రపోతుండగా ఈ అయిదుగురు తమ్ములూ చేరి గూనన్నని ఒక పెట్టెలోపెట్టి తాడు బిగించి ఆ వూరి పక్కగా ఒక ఏరువుంటే అందులో పారెయ్యటానికి మోసుకుపోసాగారు. పెట్టెని కొంతదూరం మోసుకువచ్చేసరికి వాళ్ళకి దాహంవేసింది. ఆ చుట్టుప్రక్కల ఎక్కడైనా మంచినీళ్ళు దొరుకుతయ్యేమోనని అయిదుగురూ పెట్టెని అక్కడపెట్టి నీళ్ళకోసం బయలుదేరారు.

వాళ్లు అటువెళ్లిన కాసేపటి కొక గొల్లవాడు మేకల్ని మేపుకుంటూ అక్కడికొచ్చాడు. పెట్టెలోవున్న గూనన్న "ఒద్దంటే పెళ్లి, ఒద్దంటే పెళ్ళి" అంటూవున్నాడు





ఇదివిని గొల్లవాడు! పెట్టె తెరిచి చూచి, "ఎవరుమీరు? దీంట్లో ఎందు కున్నారు?" అని అడిగాడు.

"నా అన్నలు నాకు పెళ్లిచెయ్యాలని పట్టుబట్టారు. నాకు పెళ్ళిచేసుకోవాలని ఏమాత్రమూ లేదు. అయినా నన్ను బలవంతాన ఇందులోపెట్టి ఈ పక్క వూళ్లో వున్న ఒక అమ్మాయికిచ్చి నన్ను పెళ్ళిచేద్దామని తీసుకెడుతున్నారు" అని చెప్పాడు గూనన్న.

'నీకు పెళ్లి అక్ఖర్లేదనివుందిగదా! నాకు పెళ్లి కావాలనివుంది. నీబదులు నేను ఈ పెట్టెలో కూర్చుంటాను' అన్నాడు గొల్లవాడు.

గూనన్నకి అంతకంటే. ఇంక ఏం గావాలి. గొల్లవాణ్ణి పెట్టెలోపెట్టి, తాడుతో బిగించి తను మేకల్ని తోలుకుపోయాడు.

ఈలోగా గూనన్న అయిదుగురు తమ్ములు తిరిగొచ్చి పెట్టెని మోసుకుపోయి "చావు, గూనివెధవా" అంటూ ఏట్లో పడేసి యింటికివచ్చారు. దారిలో గూనన్న మేకలు తోలుకుంటూ వస్తూ ఎదురైనాడు.

"ఏట్లో పడేశామే, మళ్లీ ఎలా వచ్చావు? ఈ మేకలెలా వచ్చినై?" అని అడిగారు.

"మీరు నన్ను ఏట్లోకి త్రోసినతర్వాత పెట్టెలోవుండే 'బుడకాం కోమేక, బుడకాం కోమేక' అంటూవున్నాను. అలా పదిసార్లనేసరికి పెట్టె ఒడ్డుకి కొట్టుకొచ్చి ముక్కలు ముక్కలుగా పగిలింది. పగిలిన ఒక్కొముక్క ఒక్కొమేక అయింది." అని చెప్పాడు గూనన్న.

ఈసారికూడా నిజమేనని నమ్మారు గూనన్న తమ్ములు. "అయితే మమ్మల్ని కూడా ఒక పేద్ద పెట్టెలోపెట్టి ఏట్లో పడేస్తావా? మాకూ చాలా మేకలు వస్తయ్యి" అని అడిగారు.

గూనన్న సరేనని ఒక పేద్ద పెట్టె చేయించి అయిదుగురు తమ్ముల్ని అందులోపెట్టి తాడుతో బిగించి, ఒక బండిమీద ఏటిదగ్గిరికి తీసుకుపోయి అందులో పడేశాడు. ఈవిధంగా అమాయకుడైన అన్నని చంపాలనుకుని అయిదుగురు తమ్ములూ చనిపోయారు. ఆతర్వాత గూనన్న హాయిగా బ్రతుకుతున్నాడు.



# దొంగ ఉపవాసము



అనగా అనగా ఒక వూళ్లో బ్రాహ్మణ దంపతులు వుండేవారు. వారికి పిల్లా జెల్లా లేరు. బ్రాహ్మణుడు కొంచెం దైవ భక్తుడు; ఆచారవంతుడు. ప్రతి ఏకాదశీ ఉపవాసం వుండేవాడు.

ఒక ఏకాదశికి బ్రాహ్మణుడు తన అలవాటు ప్రకారం ఉపవాసం వున్నాడు. ఆ రోజు బ్రాహ్మణుడి భార్య తనుకూడా ఉపవాసం వుంటానంది.

"ఒసే, నాకు అలవాటుకనక నేను ఉపవాసం వుంటున్నాను. నీ కెందుకు ఈ బాధ. నీవు ఉపవాసం వుండలేవు" అన్నాడు బ్రాహ్మణుడు.

"చాలు చాల్లెండి. మీరేగామాలు మహ ఉపవాసం వుండగలిగేది. నేను మాత్రం ఎందుకు వుండలేను? అడగక, అడగక యివ్వాళ అడిగితే యిదా మీరు చెప్పేది. నేను ఏమాత్రం ఒప్పుకోను. ఏమైనాసరే నేనూ ఉపవాసం వుంటాను" అని పట్టు బట్టింది భార్య.

"సరే, నీ యిష్టంవచ్చినట్లు చెయ్యి. నువ్వు ఆకలి ఆపుకోలేవేమోనని, నీ మంచికే చెప్పాను. ఆ తర్వాత నీ యిష్టం" అన్నాడు బ్రాహ్మణుడు. బ్రాహ్మణుడి భార్య తనుకూడా ఉపవాసం వుండి తీరాలనే నిశ్చయించుకుంది.

ఆరోజు యిద్దరూ ఉపవాసం వున్నారు. బ్రాహ్మణుడికి అలవాటుకనక ఎప్పటిలాగే వుండగలిగాడు. కాని బ్రాహ్మణుడి భార్యకి మాత్రం కడుపులో చురచుర కాలుతోంది. అయినా, పైకిమాత్రం బెట్టుగా తనకి ఆకలే లేనట్లు నటించసాగింది.

సాయంకాలం అయింది. ఇద్దరూ రోజల్లా ఉపవాసం వున్నారు కనక పెందరాళే పడుకున్నారు. కొంతసేపటికి బ్రాహ్మణుడు నిద్రపోయాడు. కాని, బ్రాహ్మణుడి భార్యకి మాత్రం ఎంతసేపటికీ నిద్రరాలా. అవును మరి, ఒక చెంప కడుపులో కాలుతుంటే నిద్రెలా పడుతుంది?

సి. హెచ్. శ్రీరామమూర్తి, అమలాపురం





"పంతానికిపోయి అనవసరంగా ఈ ఉపవాసం నే నెందుకున్నానా భగవంతుడా!" అని బ్రాహ్మణుడి భార్య ఎంతో విచారించింది. అంత కంతకీ ఆకలి జాస్తి అవుతోంది. బ్రాహ్మణుడి భార్య యిక వుండలేక పోయింది. "కాసిని పచ్చిపాలన్నా తాగంది యిక నేను వుండలేను. అయ నెలాగో నిద్రపోతున్నారు కనక నేను పాలు తాగినట్లు అయనకి తెలియదు కూడా." అనుకుంది.

వాళ్లకి చాల గేదెలు, ఆవులుకూడా వున్నై. బ్రాహ్మణుడి భార్య నెమ్మదిగా లేచివెళ్లి ఒక శేరు పాలు పితుక్కొని తెచ్చుకుంది. తెచ్చుకుని, "పాలు ఎలాగో పిండానుగదా, రవంత నిప్పురాజేసి కాచుకుతాగితే ఎంత బాగుండును." అనుకుని నిప్పంటించి పాలుకాచింది. తర్వాత, "కాచినదాన్ని ఎలాగో కాచాను, కాసిని బియ్యం పోస్తే బాగుండును" అనుకుని కాసిని బియ్యం పోసింది. తర్వాత, "బియ్యం, ఎలాగో పోశాను. కాస్త బెల్లం కూడా వేస్తే కమ్మగావుంటుంది" అనుకుని ఒక బెల్లపు అచ్చుతెచ్చి అందులో వేసింది. అంతటితో వూరుకుందా? ఉహుం, "ఇంతా చేసి దీంట్లో నెయ్యిలేకపోతే ఏం బాగుంటుంది?" అనుకుని తన కడుపులో అత్రం కొద్దీ అక్కడున్న ముంతెడు నెయ్యా అందులో కుమ్మరించింది. దాంతో గిన్నెడు వేడి వేడి పాయసం తయారైంది.

ఇక ఆలస్యంచేస్తే మొగుడు లేస్తాడేమో, యింత కష్టపడి చేసుకున్న పాయసం తనకు తినేయోగం లేకుండా పోతుందేమోనని, బ్రాహ్మణుడి భార్య ఆపాయసమంతా ఒక పీటమీద పోసి చల్లార్చుకుంటూ గబగబా తినేసింది. అప్పటికి ఆమె కడుపు చల్లబడి, మళ్లీ ఏమీ ఎరగనట్టు వచ్చి పడుకోబోయింది.

ఇంతలో ఆమెకి ఒక అనుమానం వేసింది, తననోరు పాయసం వాసన





కొడుతుందేమో? అని. అంచేత అక్కడ పోక చెక్కల డబ్బాలోంచి ఒక పోక చెక్క వేసుకుంది, పాయసం వాసన కొట్టకుండా. అయినా ఆమెకి యింకా గుండెల్లో బెదురు పోలా. "తమలపాకులుకూడా వేసుకుంటే, యింకా మంచిది, అసలు కొంచెంకూడా వాసన కొట్టదు" అనుకుంది. అనుకుని, కాసిని ఆకులు సున్నంరాసి వేసుకుంది.

అప్పటికి బ్రాహ్మణుడి భార్యకి మనస్సు కుదుటబడింది. ఏకాయెకిని గదిలోకివచ్చి దీపం ఆర్పి, గదితలుపు ఘడియవేసి ఏమీ ఎరగనిదానిలా భర్త దగ్గిరికివచ్చి, "ఏమండీ, అప్పుడే అంత నిద్దరేమిటీ? నాకు నిద్దరరావటం లేదు, ఏదైనా కథ చెప్పండి" అంటూ లేపింది.

నిజానికి బ్రాహ్మణుడు నిద్రపోవటం లేదు. తనభార్య మొదట పాలుపితకటానికి లేచివెళ్లినప్పుడు, ఆ అలికిడికి మెళుకువ వచ్చింది. కాని అప్పట్నించీకూడా నిద్ర పోతున్నట్టే నటిస్తూ భార్య చేసినదంతా చూస్తూనేవున్నాడు. భార్యవచ్చి యిలా అనేసరికి, బ్రాహ్మణుడు యింకా నిద్ర పోతున్నట్టే నటిస్తూ, కళ్ళు నులుముకుంటూ, "అబ్బా. చంపకే. ఉపవాసం వుండటాన నీరసంగావుంది. నీకు నిద్ర రాకపోతే కూర్చో. నేనుమాత్రం యిప్పుడు కథ చెప్పలేను." అన్నాడు.

"మీదంతా మరీ విచిత్రమండీ! నాకు లేని నీరసం మీకెందుకొచ్చిం దేమిటి? వేషాలు బోక, కథ ఏదైనా చెప్పండి" అని బలవంతం చేసింది బ్రాహ్మణుడి భార్య.

అప్పుడు బ్రాహ్మడు, "అయితే చెబుతున్నా విను" అంటూ యిలా పాడాడు.

"కథ కథ, కాటుక రాయుడు;
పీటెడు పాయసం నోటికి రాయుడు
కడ ముంతెడు నెయ్యి ఘటుక్కు
ఆకు అటుక్కు, పోక పొటుక్కు
దివ్వె దిటుక్కు, ఘడియ ఘటుక్కు
నువ్వు అటుక్కు—నేను యిటుక్కు!"

అని యింకోవైపు తిరిగి పడుకున్నాడు.

ఇది వినేసరికి బ్రాహ్మణుడి భార్య తెల్లబోయింది. తను పాలుపితకటం దగ్గిర్నించి, జరిగిందంతా భర్త కనిపెట్టాడని తెలుసుకుని, మళ్లీ నోరెత్తకుండా కుక్కిన పేనులా తనూ నిద్రపోయింది.

ఆరోజు మొదలు బ్రాహ్మణుడిభార్య మళ్లీ ఉపవాసముంటానని అడిగితే ఒట్టు. బ్రాహ్మణుడుమాత్రం తన అలవాటు చొప్పున ఉపవాసం వుంటూనేవున్నాడు.

అంతటితో కథ కంచికి మనమింటికి.



# సొట్ట-పొట్టి-పిట్ట

ఒక ముళ్ళతుప్ప చాటున ఒక పొట్టి పిట్ట వుండేది. పొట్టిపిట్ట పుట్టిన కొద్దిరోజులకే దాని తలిదండ్రులు చనిపోయారు. పైగా పుట్టుకతోనే మన పొట్టిపిట్టకు ఒక కాలు సొట్ట. రెక్కలు బాగా ఎదగకముందే తలిదండ్రులు చనిపోవటంవల్లనూ, పైగా సొట్టకాలు కావటంచేతనూ మన పొట్టిపిట్ట పాపం అలాగే కుంటుకుంటూ, కుంటుకుంటూ తిరిగి అక్కడా అక్కడా ఒక గింజో గితకో తెచ్చుకుతింటూవుండేది.

ఇలాగే కొంతకాలం కష్టపడుతూ వచ్చింది. క్రమేణా రెక్కలు ముదిరి పొట్టిపిట్ట ఎక్కడికి పడితే అక్కడికి ఎగిరి వెళ్ళకలుగుతూవుంది.

ఒకరోజున అలా ఎగురుతూ, ఎగురుతూ మన పొట్టిపిట్ట ఒక చెరువుదగ్గిరికివచ్చి, చెరువులో ఎగురుతున్న చేపల్ని చూస్తూ నుంచుంది.

మన పొట్టిపిట్టకి ఒక్క కాలు మాత్రం సొట్ట అన్న మాటేగాని దానంత అందమైన పిట్ట ఆ చుట్టుప్రక్కల లేదు. బంగారంలా మెరిసిపోతుండేది, దాని శరీరం. అలాంటి పిట్టని చెరువు అంతకు ముందెప్పుడూ చూసివుండలేదు. అందుకని పొట్టిపిట్టని చూసి, "ఎవరు నువ్వు? ఎందుకిలా వచ్చావు?" అని అడిగింది చెరువు.

"నేను ఆ కనపడే ముళ్లతుప్పల వెనక వుంటున్నాను. వూరికే యిలా వచ్చాను" అంది పిట్ట.

"నీకు తల్లిదండ్రులు లేరూ?" అని అడిగింది చెరువు.

సరిగ్గా యింక బుద్ధితెలియక మునుపే తలిదండ్రులు చనిపోవటంచేత, 'తల్లిదండ్రు'లంటే ఏమిటో పొట్టిపిట్టకు అర్థం కాలేదు. అందుకని "తల్లిదండ్రు లెవరు?" అని అడిగింది.

పిట్ట యిలా అడిగేసరికి చెరువుకు నవ్వొచ్చింది, జాలీవేసింది. "అయ్యో, అదేమిటి! అంతమాత్రమైనా తెలియదా? నిన్ను కని, పెంచి, పెద్దచేసినామె నీ 'తల్లి'. ఆమె భర్తే నీ 'తండ్రి.' అలాంటివాళ్లెవరూ నీకు లేరా?" అని అడిగింది చెరువు.

"ఇప్పుడు అలాంటివాళ్ళెవరూ నాకు లేరే! కాని, నా చిన్నతనంలో వాళ్ళను

లై. రామారావు, బరంపురం



లేకపోతేమాత్రమేమి? ఇవాళనించీ నేను నీకు తోడుగావుంటాను. రోజూ నా దగ్గిరికి వచ్చి చేపలు తినిపోతూవుండు. ఒకరి కొకరం సహాయంగా వుంటూవుందాం." అని ధైర్యంచెప్పింది చెరువు.

చెరువు చెప్పినదంతా విన్నతర్వాత పొట్టిపిట్ట ధైర్యంతెచ్చుకుని, సంతోషంగా ఎగురుకుంటూ వెళ్లిపోయింది. ఆ రోజు మొదలు పొట్టిపిట్ట చెరువుదగ్గిరికి వచ్చి కాసిని చేపలు తిని, చెరువునీళ్ళలో తన నీడ చూసుకొని తన అందానికి తనే మురుసుకుంటూ, చెరువుచుట్టూతా కాసేపు పచార్లుచేసి, తిరిగి యింటికి వచ్చేసేది.

* * *

ఇలా కొన్నాళ్ళు గడిచినై. అది వర్షాకాలం. మామూలుగా పొట్టిపిట్ట ఒకరోజు ప్రొద్దున్నే చెరువుదగ్గిరికి వచ్చింది. అప్పుడు చెరువు యిలా అంది-"ఇన్నాళ్ళనించీ నీకు ఆహారం యిస్తూ నీకు తోడుగా వుంటున్నాను గదా! నేను నిన్నొక్క సహాయం అడుగుతాను చేసిపెడతావా?"

"అలాగే చేస్తాను. నువ్వు తప్ప నాకు మాత్రం యింకెవరు వున్నారు. ఏం సహాయం కావాలో చెప్పు" అన్నది పొట్టిపిట్ట.

"ఏమీ లేదు. నా ఆయుస్సు చాల తక్కువ. ఈ వర్షాలు పూర్తి అయాక, చలికాలం వస్తుంది. తర్వాత వచ్చేది ఎండాకాలం. ఎండాకాలం పూర్తయేసరికి

చూసినట్లు ఏదో కొద్దిగా జ్ఞాపకం," అన్నది పొట్టిపిట్ట.

"బహుశా నువు పుట్టినతర్వాత నీకు బాగా వూహ తెలియకపూర్వమే చనిపోయి వుంటారు" అన్నది చెరువు.

ఇది వినేసరికి, "మరైతే యిక నాకెవరు దిక్కు" అని పొట్టి పిట్ట పాపం ఏడవటం మొదలెట్టింది.

చెరువుకి చాల జాలివేసింది. "ఎందుకలా ఏడుస్తావు? ఏడిస్తేమటుకు చనిపోయిన నీ తలిదండ్రులు తిరిగి బ్రతికి వస్తారా, ఏమన్నానా! కష్టాలు అందరికీ వస్తూనేవుంటై. కష్టాలు వచ్చినప్పుడే మనం ధైర్యంగావుండాలి. నీ తల్లీ దండ్రీ





నా ఆయుస్సూ పూర్తవుతుంది. రోజురోజుకీ ఎండి చివరికి పూర్తిగా ఎండి చచ్చిపోతాను. అలా ఎండిపోకుండా ఏదైనా ఉపాయం చెప్పగలవా?" అని అడిగింది చెరువు.

పొట్టిపిట్ట కాస్సేపు ఆలోచించి, ఒక్క సారిగా ఎగిరిపోయి మరి కాస్సేపటికి ముక్కుతో ఏవో కొన్ని గింజలు కరుచుకు వచ్చి వాటిని చెరువుచుట్టూతా పడేసింది.

తర్వాత వర్షాలు కురిసినై. పొట్టిపిట్ట వేసిన గింజలు మొక్కలు మొలిచి రోజు రోజుకూ పెరగసాగినై. అలా పెరిగి పెరిగి ఎండాకాలం వచ్చేసరికి చెరువుచుట్టూతా పెద్దపెద్ద చెట్లుగా తయారై చెరువు ఎండి పోకుండా నీడతో కప్పేసినై. ఎండాకాలం రానూ వచ్చింది. పోనూ పోయింది. చెరువు మాత్రం ఎండిపోకుండా ఎప్పటిలాగా నీళ్లతో నిండివుంది. చెరువు చాల సంతోషించి పొట్టిపిట్టకు చేపలు ఆహారం యిస్తూవుంది.

* * *

మరో సంవత్సరం గడిచింది. అది వర్షాకాలం. వర్షాలకి పొట్టిపిట్ట గూడు కాస్తా పడిపోయింది. ఎక్కడ గూడు కట్టుకున్నా నిలుస్తుందనే ఆశ లేకుండా పోయింది. అప్పుడు పొట్టిపిట్ట తనకేదైనా సహాయం చెయ్యమని చెరువుని కోరింది.

ఎండాకాలంలో ఎండిపోకుండా పొట్టి పిట్ట తనని కాపాడినసంగతి చెరువు మర్చి పోలా. అందుకని వెంటనే తన గట్టునే ఉన్న బండలసందున ఒక చక్కటిచోటు చూపించింది. పొట్టిపిట్ట సంతోషించి అందులో వుంటూవుంది.

కాని భగవంతుడు అవి రెండూ సుఖంగా వుండటం చూడలేకపోయాడో ఏమో! వర్షాకాలం వెళ్ళి శీతాకాలం వచ్చింది. ఆ దగ్గర్లోవున్న పొలాలకి నీరు కావల్సి వచ్చి, చెరువునించి కాలవలు త్రవ్వి నీళ్లు తోడివేసారు. అది చూసి గుండెలు బద్దలయ్యేట్లు ఏడ్చింది పొట్టిపిట్ట.

"నా ప్రాణానికి తనప్రాణం యిచ్చే నా స్నేహితుడే లేనప్పుడు యిక నేను మాత్రం బ్రతికేమి లాభం?" అనుకుని తనుకూడా నీటిలోపడి మిత్రుణ్ణి చేరుకుంది.





పై బొమ్మలోవున్న నాలుగు పిట్టలలోను ఒకపిట్టే మధ్యని వున్న గూటికి చేరుకోగలదు. ఆ పిట్ట ఏదో కనుక్కోండి.






నిన్నగాదు, మొన్నగాదు, ఎన్నో వందల సంవత్సరాల క్రిందటి సంగతి.

ఒక వూళ్లో ఒక బ్రాహ్మణుడు వుండేవాడు. అతను బాగా చదువుకున్నవాడు. అన్ని శాస్త్రాలలోనూ ఆరితేరినవాడు. అతనికి పెళ్లాం బిడ్డలు లేరు. అయినా ఒక్క పొట్ట నింపుకోటానికే బ్రాహ్మడు చాల కష్టపడేవాడు. పోనీ తెలివితేటల కేమన్న తక్కువా అంటే అదీ లేదు. అతన్ని మించిన పాండిత్యంగలవాళ్లు ఆ చుట్టుప్రక్కల ఎక్కడాలేరు. అయినా, పాపం అదేమి దురదృష్టమో అతనికి ఎక్కడా నౌకరీ దొరకలేదు.

ఇప్పటిలాగ ఆ రోజుల్లో వ్రాసుకునేందుకు కాగితాలు, కలాలు వుండేవి కావు. తాటియాకులమీద గంటంతో వ్రాసుకునేవారు.

మన బ్రాహ్మణుడికి ఏమీ తోచేది కాదు. ఒకరోజు రెండురోజులైతే ఎలాగో కాలం వెళ్లబుచ్చవచ్చుగాని నెలలు,సంవత్సరాలు వూరికే ఏమీ పనిలేకుండా కూర్చోటానికి వీలవుతుందా? అంచేత బ్రాహ్మణుడు యిన్ని తాటియాకులు ముందువేసుకుని తనయింటి వీధి అరుగుమీద కూర్చుని, తన మనస్సుకు ఏది తోస్తే అదల్లా వ్రాయడం మొదలెట్టాడు. తన కళ్ళకు ఏది కనపడ్డా, చెవులకు ఏది వినపడ్డా అన్నీ వెంటనే వ్రాసేవాడు. వీధిలో కుక్క మొరిగితే వ్రాసేవాడు; పొలంలో నక్క కూస్తే వ్రాసేవాడు. ఒకటేమిటి చెట్ల ఆకులు గలగలమని గాలికి చప్పుడు చేసినాకూడా ఆ సంగతి బ్రాహ్మణుడు వ్రాసేవాడు.

కొలగొట్ల శాంతకుమారి, ఏలూరు



. ఈవిధంగా ఒకరాత్రి అని లేదు, పగలని లేదు ప్రొద్దస్తమానమూ రాస్తూవుండేవాడు. ఏమి రాస్తున్నాడో, ఎందుకు రాస్తున్నాడో అతనికే తెలీదు. కాని ఒక్కనిమిషం వృధాపోకుండా వెయ్యి కళ్లతో కనిపెడుతూ వెయ్యి చెవులతో వింటూ వ్రాస్తుండేవాడు.

అలా వ్రాయగా వ్రాయగా తాటియాకులు కట్టలు కట్టలుగా పెరిగిపోతున్నై. ఇల్లంతా తాటాకు దస్త్రాలతో నిండిపోతోంది. అయినా బ్రాహ్మణుడు వ్రాయటం మానలేదు.



ఇలా వుంటుండగా ఒరోజురాత్రి ఆవూరి రాజుగారింట్లో దొంగలు పడి జవ్హరీ అంతా ఎత్తుకుపోయారు. రాజుగారి భటులు ఎంత వెంబడించినా చిక్కకుండా దొంగలు పారిపోయారు. దొంగల్ని పట్టుకోలేక పోయామని రాజుగారి ఉద్యోగస్తులంతా చాల విచారించారు. ఇంతలో వాళ్ళలో ఒకరికి ఒక ఆలోచన తట్టింది, "రాత్రింబగళ్లు ఏది జరిగినా, ఆఖరికి చీమ చిటుక్కుమన్నాకూడా వ్రాసే మన దస్త్రాల బ్రాహ్మణుడి దగ్గిరికెళ్లి అడిగితే ఏమైనా ఆచూకీ దొరుకుతుందేమో" అని.

ఈ ఆలోచనతో రాజుగారి భటులు మన బ్రాహ్మణుడి దగ్గిరికి వచ్చి అడిగారు. వెంటనే బ్రాహ్మణుడు తను ఆ రోజు వ్రాసిన తాటియాకుల దస్త్రం విప్పి వెతికాడు. వెతగ్గా, వెతగ్గా ఒకచోట ఈ వాక్యం వుంది—"రాత్రి రెండుజాములకు మా యింటికి పడమరగావున్న నూతిలో 'గుభేల్' మన్నది."

ఇంకేంగావాలి? "బహుశా దొంగలు పారిపోతూ జవ్హరీ అంతా ఆ బావిలో

పారేసివుంటారు.'' అనుకుని భావిలో వెతకటం మొదలెట్టారు. చివరికి, ఒక్క పూస పోకుండా పోయిన సొమ్మంతా భావిలో దొరికింది. వెంటనే ఈ సంగతి ఒకరువెళ్లి రాజుగారికి తెలియజేశారు. ఎల్లా దొరికిందంటే, దస్త్రాల బ్రాహ్మణుడి కథంతా చెప్పారు.

రాజుగారు ఎంతో ఆశ్చర్యపోయారు. వెంటనే మంత్రినిపిలిచి, "ఇటువంటి బ్రాహ్మణుడు ఒకడుండటం మన రాజ్యానికే ఎంతో గొప్ప గౌరవం. ఇవాళనించీ బ్రాహ్మణుడికి మన కోటగుమ్మం దగ్గిర ఠాణాలో ఉద్యోగం ఏర్పాటుచేయించు. అతనికి ఒక డవాలీ బంట్రోతూ యింకా కావలసిన రాజ చిహ్నాలు కూడా ఏర్పాటు చేయించు" అని ఆర్డరు వేశారు.

మంత్రి, ఈ ఏర్పాటు బ్రాహ్మణుడికి తెలియజేశాడు. బ్రాహ్మణుడికి చెప్పలేనంత సంతోషం కలిగింది. ఆరోజు మొదలు బ్రాహ్మణుడు తన పూరిగుడిశె వదిలి ఠాణాలోనే వుండసాగాడు. అదివరకు అనుకున్నప్రకారం, ఒక బిళ్ల బంట్రోతుని



కూడా ఏర్పరిచారు. పైగా కొంత భూమి కూడా యిచ్చి ఈ దస్త్రం వ్రాసే పని వంశ పారంపర్యంగా వచ్చేటట్టు ఏర్పాటుచేశారు.

ఆరోజునించి బ్రాహ్మణుడిని అంతా "గుభేలు దస్త్రం శాస్త్రి" అని పిలిచేవాళ్ళు.

"ఎలా పిలిస్తే నాకేం, నా కడుపులో చల్ల కదలకుండావుంది. అంతే చాలు" అని తృప్తిపడి బ్రాహ్మణుడు హాయిగా కాలక్షేపం చేస్తున్నాడు.

అంతటితో కథ కంచివెళ్లింది, మనం యింటికి వచ్చాం.




ఒక ఫకీరుకు నలుగురు శిష్యులుండేవారు. ఆ నలుగురు నాలుగుదేశాల వాళ్లు. ఒకడు గ్రీసు దేశము నుండి వచ్చినవాడు. మరొకడు తుర్కీ దేశపువాడు. ఇంకొకడు అరేబియావాడు. నాలుగవవాడు పర్షియా దేశస్థుడు. ఎవడి భాష వాడికితప్ప మరొక భాష తెలియదు. ఫకీరుకుమాత్రము ఛప్పన్న భాషలు వచ్చును. ఆయన ఎన్ని దేశాలో కాలినడకను తిరిగినవాడు.

శిష్యులు నలుగురికి ఒకనాడు డబ్బు సంచి ఒకటి దొరికినది. అది తీసుకుని పోయి వాళ్లు గురువుగారి కిచ్చినారు. ఆయన "ఈ సొమ్ము పెట్టి మీ కిష్టమైన మంచి పళ్లు కొని తినండి" అని చెప్పారు.

గ్రీకు అన్నాడు "నాకు అస్తఫీల్ కొని పెట్టండి. అంత మంచి పండు ప్రపంచంలో మరి లేదు."

"ఉజుమ్ పండ్లు చాలా శ్రేష్ఠమైనవి. అవి తిననివాడి జన్మ ఎందుకు" అని తురక అన్నాడు.

అరబ్బీవాడు అందుకొని "పండంటే పండు అన్నాబ్. అది కొని తిందాము" అన్నాడు.

"మీకేం తెలుసును. అంగూర్ ను మించిన పండు లేనేలేదు. అంగూర్ కొనండి" అని పర్షియావాడు చెప్పినాడు.

ఫకీరు నవ్వడము ఆరంభించినాడు.

నేను కోరిన పండే మంచిదంటే నేను కోరినది మంచిది అని శిష్యులు నలుగురు పెద్ద పోట్లాట పెట్టుకున్నారు. ఎవడి మట్టుకు వాడు తాను కోరిన పండుయొక్క గొప్పతనము వర్ణించినారు.

ఫకీరు పకపక నవ్వుతున్నాడు.

---

కపిల వెంకట్రావు

---



శిష్యులు తగవులాడి, జుట్టు జుట్టు పట్టుకునే స్థితికి వచ్చినారు. వాళ్ళను అపుచేసి ఫకీరు "మీకు కుదరలేదు. కనుక నేనే ఏదో ఒక పండు కొంటాను. దానితో మీరంతా తృప్తిపడి ఉండాలి" అని చెప్పి వాళ్లను ఒప్పించి, అంగడికిపోయి నాలుగు గుత్తుల ద్రాక్షపండ్లు తెచ్చినాడు.

పళ్ళు చూచీ చూడడముతోటే శిష్యులు గంతులు వేయడము మొదలుపెట్టినారు.

"నా మాట నెగ్గింది. అదుగో అస్తఫిల్" అన్నాడు గ్రీకు.

"చూసుకోండి, నేనే గెల్చాను." అని తుర్కివాడు.

"అవీ. అదుగో అన్నాబ్. నే నేం చెప్పాను" అని అరబ్బీయుడు కేకవేశాడు.

"అరెరే, గురువుగారు అంగూర్ తెచ్చారే. అంగూర్, అంగూర్." అని పర్షియావాడు చప్పట్లు కొట్టినాడు.

"మీరు నలుగురు కోరినదీ ఒకటే పండు. ఒకరి భాష ఒకరు తెలుసుకోకుండా అంతసేపు తన్నుకున్నారు. ఇప్పుడైనా కాస్త ఓరిమి నేర్చుకోండి" అని ఫకీరు చెప్పి ఒక్కొక్కడికి ఒక్కొక్క పళ్ల గుత్తి ఇచ్చివేసినాడు. వాళ్ళు ఎంత బ్రతిమాలినా తాను మాత్రము ఒక్క పండైనా తినలేదు.



## మల్లెపూలదండ

చిరుమల్లె చెట్టంత
చితక పూసింది!!!
చెట్టు కదలాకంత
కొమ్మ వంచండి,
కొమ్మ విరుగాకంత
పూలు కోయండి!
(అందులో) పెదపూలు
దండ గుచ్చండి!!
దొడ్డి గుమ్మములోన
దొంగలున్నారు!!!
దాచుకోకుంటేను
దోచుకుంటారు!!!

సంపాదన:
తురిమెళ్ల ఇంద్రాణిదేవి, బళ్లారి.

### పజిలుకు జవాబు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 నే | ■ | ■ | ■ | 2 కా | 3 వే | రి |
| 4 తా | 5 ర | ■ | 6 ధా | లు | ట | ■ |
| 7 జీ | వి | ■ | ణి | ■ | ■ | ■ |
| ■ | 8 క | ర | వా | ల | 9 ము | ■ |
| ■ | ■ | ■ | స | ■ | 10 సు | 11 ధ |
| ■ | 12 చా | 13 ప | ము | ■ | గు | రి |
| 15 శ | కు | ని | ■ | ■ | ■ | త్రి |

పై బొమ్మలో ఒకమూల యిల్లువుంది చూశారూ, ఆ యింటికి ఎవరో చుట్టాలు బండిలో వస్తున్నారు. వాళ్ళకి ఆవూరు కొత్త. ఏదారిన వెడితే ఆ యింటికి చేరుకోగలరో చూపండి,





## పోలికలు





## ఫొటో పోలిక






## ఆధారములు

అడ్డము :

2. ఒక నది పేరు
4. నక్షత్రము
6. పడిపోవుట
7. ప్రాణి
8. ఖడ్గము
10. అమృతము
12. ధనుస్సు
14. లక్ష్యము
15. కౌరవుల మేనమామ




నిలువు :

1. సుభాస్‌చంద్రబోసు
2. శరీర భాగము
3. రాజులకు ప్రియమైన క్రీడ
5. స్త్రీలు ధరింతురు
6. అంతఃపురము
9. అవకుంఠనము
11. భూమి
12. చిన్న కత్తి
13. కార్యము

---

12 వ పేజీలోని గుడ్లగూబల బొమ్మకు జవాబు :

8, 4 నెంబర్లుగల రెండు గుడ్లగూబలూ ఒక్క మోస్తరువి.

---

# సావరిన్ సూక్తులు




రైలు బళ్లలో తెగనమలొచ్చు.
ట్రాముల్లో మరి తినొచ్చు నీ యిష్టం.
బస్సులలో ఇక బలే బాగు.
ఒకటననేల అన్ని వేళల, అన్నిచోట్ల.
కాని, వినవోయి: ఒక మాట

## బడిలో మాత్రం తినొద్దు నీవు



# సావరిన్ స్వీట్స్

కె. సి. పి. తయారీ




# యువ ప్రచురణలు

ఆధునిక రచయితల పుస్తకాలకు
మాకు వ్రాయండి. కేటలాగు పంపుతాము.



## యువ బుక్ డిపో

గవర్నరుపేట<br>బెజవాడ



ఆచారప్పన్ వీధి<br>మద్రాసు 1.

---

తెలుగు, ఇంగ్లీషు, హిందీ, అరవం, కన్నడంలో
అన్ని రకముల అచ్చుపనులకు
మమ్మల్ని అడగండి.



# బి. యన్. కె. ప్రెస్

**37**, ఆచారప్పన్ వీధి :: మద్రాసు **1**

## అబ్బాయిలూ, అమ్మాయిలూ!

మీరు కథలుగాని, పాటలుగాని యింకా ఏవైనా రచనలుగాని మాకు పంపేటప్పుడు మూడు కానుల పోస్టుబిళ్లకూడా పంపాలి. మీరు పంపినవి వేసుకుంటున్నామో లేదో మీరు తెలుసుకోవాలన్నా, వేసుకోకపోతే వాటిని మీకు త్రిప్పి పంపాలన్నా ఈ మూడు కాన్లబిళ్ల పంపటం అవసరం. మీ రచనగురించి ఏమైనా తెలుసుకోవాలంటే రచనతోపాటే మూడుకాన్ల బిళ్లకూడా పంపాలి. రచన పంపినతర్వాత వ్రాసిన ఉత్తరాలకి జవాబు యివ్వటానికి వీలుండదు.

ఈ విషయాలు క్రొత్తవికావు. ప్రతినెలా మీకు చెబుతున్నవే. అయినా మీలో చాలమంది ఈ సంగతులు గుర్తుంచుకోవటం లేదు. ఇకనైనా గుర్తుపెట్టుకోండి.

రచనలు పంపే అడ్రసు ఇది:

సంచాలకుడు : చందమామ

పోస్టుబాక్సు నెంబరు : **1686**, మద్రాసు.


**Printed and Published by B.N. REDDI, at B. N. K. Press, 37, Acharappan Street, Madras 1**
Editors: CHAKRAPANI and K. RAJA RAO.



*Chandamama, June '48* — *Photo by: B. Ranganatham*

శిల్పి సృష్టి

## మూడుకోట్లఆంధ్రులకు మూడు ఉత్తమపత్రికలు

నేడే చందాదారులుకండి!

# చందమామ

పిల్లలకు

సాలుచందా 6-0-0

రెండేండ్లకు 10-0-0

# యువ

యువ విద్యార్థులకు

సాలుచందా 3-0-0

రెండేండ్లకు 5-0-0

# ఆంధ్రజ్యోతి

పెద్దలకు

సాలుచందా 5-8-0

రెండేండ్లకు 10-0-0

ఆఫీసు

పోస్టు బాక్సు నెం. 1686 :: మద్రాసు-1

PRINTED AT THE B. N. K. PRESS. 37. ACHARAPPAN ST. MADRAS-1